"ముఖంపై మొట్టమొదటి మొటిమ వచ్చిందని కనుక్కున్న రోజు.
అదే నేను క్లియరసిల్‌ని కనుక్కున్న రోజు"



నాకింకా బాగా గుర్తుంది ఆ రోజు. నేను ఉత్సాహంతో గంతులువేస్తున్న రోజు....అక్కయ్య పెళ్ళి యింకా సరిగ్గా వారం రోజులుందేమో. కొత్త బట్టలు ముచ్చటగా వేసుకుంటూ అద్దం ముందు నిలబడ్డా—చటుక్కున గాబరాపడ్డా....నా బుగ్గ మీద ఏదో వచ్చిందని చూసుకుని....మొటిమ. నా ముఖంపై వచ్చిన మొట్టమొదటి మొటిమ. నేననుకున్నా చటుక్కున....నా కేమిటి. యిదేమిటి. యిప్పుడే రావాలేమిటి అని!

అప్పుడే వచ్చింది అక్కయ్య అక్కడికి. చూసింది నా వాలకం—"పిచ్చి పిల్లా. యీ మాత్రం తెలియదా. యీ వయసులో అందరికీ వస్తాయి గదా మొటిమలు. నాకూ వచ్చాయి. వాడేను నేనప్పుడు క్లియరసిల్. వాడాలి నువ్వూ మరి. ఏం?" వాడేను నేనూ మరందుకే. ఏమైందో తెలుసా? పనిచేసిందది!....ఇక ఆ ఉషారులో పెళ్ళి పందిట్లో ఎంత చలాకీగా తిరిగానో ఏం చెప్పమంటారు.



**క్లియరసిల్, మొటిమల్ని పోగొడుతుంది, దాంతో బాటే వాటిని పాకకుండా చేస్తుంది.**




OBM/5687/TL

# క్లియరసిల్

మొటిమల్ని పోగొట్టేందుకు ప్రత్యేకమైన చికిత్స-ఎక్కువ ప్రభావంతో పనిచేసేది.

పాల బిస్కట్లు–
నవ్వుతూ, తుళ్లుతూ పెరిగే పాపాయిలకు నేస్తం!






రుచికరమైన, పుష్టికరమైన బిస్కట్లు

బ్రిటానియా

LINTAS BIN MB 12 2117 TL











nutrine
Honeyfab

నోరూరించే రుచికరం
సహజమేగా మరి!



nutrine భారత దేశంలో అత్యధికంగా అమ్మబడే మిఠాయిలు

న్యూట్రిన్ కన్ఫెక్షనరీ కంపెనీ ప్రై. లిమిటెడ్, చిత్తూరు-517 002 (ఆంధ్రప్రదేశ్)

CLARION/NC/8572

# చందమామ

సంస్థాపకుడు : 'చక్రపాణి'
సంచాలకుడు : నాగిరెడ్డి

ఈ నెల బేతాళకథ [''నాగకన్య'']కు ఆధారం, ''వసుంధర'' రచన. కొందరు వ్యక్తులు, తమ తోటి వారిని మించిన ప్రతిభా సంపన్నులుగా వుండడం అరుదైన విషయమేంకాదు. అలాంటివారు తరచుగా దాతృత్వం, వినయగుణం కలిగి వుంటారు. అవి లేనినాడు, అపహాస్యం పాలు కావలసివస్తుంది. ఈ నీతి, ''నిజరూపం'' అన్న కథలో తెలుసుకుంటాం.

## అమరవాణి

స్థాన భ్రష్టా న శోభంతే, దంతాః కేశా స్తథా నఖాః,
గజం చమర శార్దూలౌ, హిత్వా యత్ర గౌరవమ్.

[తమ స్థానాన్ని విడిచిన ఎడల దంతాలకూ, కేశాలకూ, గోళ్ళకూ శోభవుండదు. అయితే, ఇలా స్థానం విడిచినా ఏనుగు దంతాలకూ, చమరమృగకేశాలకూ, పులిగోళ్ళకూ ఎంతో గౌరవం ఉంటుంది.]

సంపుటి 78 ఫిబ్రవరి '86 సంచిక 2

విడి ప్రతి : 2–50 : : సంవత్సర చందా : 30–00




CHITRA

# చందమామ కబుర్లు



## అత్యంతదూరంలో ఉన్న నక్షత్రమండలం

అమెరికా ఖగోళశాస్త్రజ్ఞులు, భూమికి దాదాపు 14.5 లక్ష కోట్ల కాంతి సంవత్సరాల అవతల ఉన్న ఒక నక్షత్ర మండలాన్ని కనుగొన్నారు. బార్క్లీ విశ్వవిద్యాలయానికి చెందిన ప్రొఫెసర్ హైరన్ స్పిన్‌రాడ్ ఈ విషయం గురించి తెలియజేస్తూ, భూమికి అత్యంతదూరంలో ఉన్న నక్షత్ర మండలం ఇదే అని అభిప్రాయపడ్డారు.

## కరుణ చూపిన ఏనుగు

ఆంధ్రప్రదేశ్ చిత్తూరు జిల్లాలో ఒక రైతు చెరకుతోటకు కాపలా కాస్తూ, తోటలో పడి మేస్తున్న ఒక ఏనుగును ఎనుము అనుకుని పొరబడి దుడ్డుకర్రతో బాదాడు. ఏనుగు కోపంతో అతన్ని తొండంతో చుట్టి పైకెత్తింది. అయితే వృద్ధుడయిన ఆ రైతు, ఏనుగుకు చేతులెత్తి మొక్కుతూ, కాపాడమని ప్రార్థించడంతో, ఏనుగు దయతలచి అతన్ని నెమ్మదిగా కింద విడిచి వెళ్ళిపోయింది!



## సంగీత కచేరీలో సరికొత్త రికార్డు



శ్రీరంగం దేవాలయ ప్రాంగణంలో కచేరీ చేయడంలో సరికొత్త చరిత్ర సృష్టించబడింది. ఇటీవల నాగై మురళీధరన్ అనే సంగీత విద్వాంసుడు 25 గంటలపాటు ఆపకుండా వాయులీనం వాయించాడు. అతని పక్కన కె. రాజారామన్ మృదంగం వాయించాడు!

# మీకు తెలుసా?

1. మొట్టమొదట ఉత్తరధ్రువాన్ని చేరుకున్న వారెవరో మీకు తెలుసా?
2. దక్షిణధ్రువాన్ని మొట్టమొదట చేరుకున్న దెవరు?
3. న్యూజిలాండ్‌ను కనుగొన్నదెవరు?
4. ఒకే యాత్రలో ప్రపంచాన్ని చుట్టివచ్చిన మొట్టమొదటి ఆంగ్లేయ నావికుడు ఎవరో మీకు తెలుసా?
5. ఆఫ్రికా ప్రయాణసమయంలో డేవిడ్ లివింగ్‌స్టోన్ కనుగొన్న సుప్రసిద్ధ జల పాతం ఏదో మీకు తెలుసా?

(సమాధానాలు 65 వ పేజీలో)

# అనసూయ

అనసూయ అత్రిమహాముని భార్య. ఆమె పరమ పతివ్రతగానూ, అపురూప సౌందర్యవతిగానూ, అందరి మీదా ప్రేమానురాగాలు చూపే మాతృమూర్తిగానూ పేరు గాంచింది.

ఆమె పాతివ్రత్యాన్నీ, మాతృహృదయాన్నీ ముల్లోకాలకు చాటాలని బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులు సంకల్పించారు. త్రిమూర్తులు బ్రాహ్మణరూపాలతో అత్రి ఆశ్రమానికి వచ్చారు. అనసూయ భక్తి శ్రద్ధలతో వారికి అతిథిమర్యాదలు చేసి, ఏమి కావాలో అడిగింది.

"మేము మీ కుటీరంలో కొంతసేపు విశ్రాంతి తీసుకోవాలి. మా ముగ్గురినీ ఒడిలోకి తీసుకుని నువు జోలపాడాలి. అదే మా కోరిక," అన్నారు ముగ్గురూ ఏకకంఠంతో.

వాళ్ళ మాటలకు అనసూయ చిన్నగా నవ్వి, "అలాగే నాయనలారా, మీ ఇష్టానుసారమే రండి," అంటూ వాళ్ళ మీద కొన్ని అక్షతలు చల్లి, చేతులు సాచింది.

మరుక్షణమే ఆ ముగ్గురూ శిశువులుగా మారిపోయారు. ఆప్యాయంగా ఒక్కొక్కరినీ తన ఒడిలోకి తీసుకుని, మాతృప్రేమతో పాలుపట్టి జోలపాడింది అనసూయ!

అనసూయ మహిమకు ముగ్ధులైన త్రిమూర్తులు, స్వస్వరూపాలు పొందిన తరవాత, ఆమెను కావలసిన వరం కోరుకోమన్నారు. వాళ్ళు ముగ్గురూ తన కడుపున పుట్టాలని ఆమె కోరుకున్నది. కొంత కాలానికి ఆమెకు బ్రహ్మ అంశాన సోముడూ, విష్ణు అంశంలో దత్తాత్రేయుడూ, శివుడి అంశంలో దుర్వాసుడూ జన్మించారు.

వనవాస సమయంలో సీతారామలక్ష్మణులు, అత్రి ఆశ్రమాన్ని సందర్శించారు. అప్పుడు అనసూయ సీతకు సతీధర్మాలను తెలియజేసి, వాడని పువ్వులనూ, మాయని వస్త్రాలనూ, ఆభరణాలనూ కానుకగా ఇచ్చింది.





# నిజరూపం

చతురంగపురాన్నేలే రాజు చంద్రహాసుడికి, రాజగురువు రుద్రాక్షుడి పట్ల ఎంతో భక్తి గౌరవాలుండేవి. అందుకు కారణం, చంద్రహాసుడు దాయాదులవల్ల యిబ్బందులకు గురయినప్పుడు, రుద్రాక్షుడు ఆయనకు తగు సలహాలిచ్చి, సింహాసనం కాపాడుకునేందుకు ఎంతగానో సాయపడ్డాడు.

సర్వసంగపరిత్యాగినని చెప్పుకునే రుద్రాక్షుడిలో విపరీతమైన అహంకారం వుండేది. ఆయన కాషాయవర్ణంలో వున్న పట్టు చీనాంబరాలు ధరించేవాడు. మెడలో రత్నాలహారం, చేతులకు బంగారు కంకణాలతో చాలా ఆడంబరంగా కనబడేవాడు. రాజు దగ్గిర తనకున్న పలుకుబడి కారణంగా, మంత్రులనూ, ఇతర ఆస్థానోద్యోగులనూ చిన్నచూపు చూస్తూ అవమానపరిచేవాడు.

రుద్రాక్షుడు ఒకనాడు చంద్రహాసుడితో, "రాజా, నీకు నా పట్ల వున్న భక్తిగౌరవాల సంగతి అందరూ ఎరిగినదే! కాని, రాబోవు తరంవాళ్ళు కూడా, ఆ సంగతి గుర్తుంచుకునేందుగ్గాను, నా శిలావిగ్రహాన్ని నగరంలోని, నాలుగు వీధులూ కలిసేచోట ప్రతిష్ఠించు," అన్నాడు.

చంద్రహాసుడు అందుకు సరేనని, మంత్రి మార్తాండుడికి రాజగురువు కోరిక గురించి చెప్పి, "మీరు ముందుగా ప్రసిద్ధులైన శిల్పుల గురించి విచారించండి. వారిలో అత్యంత సమర్థుడైన శిల్పికే, యీ పని అప్పచెప్పండి. అన్నింటికన్న ముఖ్యం—ఆ విగ్రహ ప్రతిష్ఠ, ఆయన రాబోయే జన్మదినోత్సవంనాడు జరిగేలా చూడండి," అన్నాడు.

మార్తాండుడు, ఆస్థాన చిత్రకారుడి చేత రుద్రాక్షుడి చిత్తరువు తయారు

జొన్నలగడ్డ రత్న



చేయించాడు. తరవాత ఆ చిత్తరువును, అవంతీనగరంలో వున్న మల్హణాచారి అనే సుప్రసిద్ధ శిల్పికి పంపుతూ ఒక లేఖ జతపరిచాడు.

ఆ లేఖలో ఆయన, ''ఈ చిత్తరువు చతురంగపురాన్నేలే చంద్రహాస మహారాజుగారి గురువులైన రుద్రాక్షులవారిది. సాధ్యమైనంత త్వరగా విగ్రహాన్ని తయారు చేసి తీసుకురండి. శిల్పాన్ని తయారు చేసేటప్పుడు, ఒక ముఖ్య విషయం గుర్తుంచుకోండి: రాజగురువు సర్వసంగ పరిత్యాగి!'' అని తెలియపరిచాడు.

రుద్రాక్షుడి జన్మదినోత్సవానికి కొంచెం ముందుగా, మల్హణాచారి విగ్రహాన్ని తయారుచేసి చతురంగపురానికి తీసుకు వచ్చాడు.

మంత్రి ఆ సంగతి రాజుకు తెలియ బరచగానే, ఆయన ఎంతగానో సంతోషించి, తాను స్వయంగా జన్మదినోత్సవం నాడు, విగ్రహప్రతిష్ఠ చేయదలచినట్టు చెప్పాడు.

మంగళవాయిద్యాల మధ్య రాజు, విగ్రహానికి అచ్ఛాదనగా వున్న పట్టు వస్త్రాన్ని తొలగించగానే, రుద్రాక్షుడు దానికేసి తేరి పారచూసి, పట్టరాని ఆగ్రహావేశంతో, ''రాజా, ఇది నా శిలా విగ్రహమా? కంచుకాగడా వేసి చూసినా, ఇందులో ఎక్కడా, నా పోలికలు కని పించవు!'' అన్నాడు.

రాజు ఆ మాటలకు ముఖం చిన్న బుచ్చుకుని, మంత్రి మార్తాండుడి కేసి చూశాడు. మార్తాండుడు వినయంగా, ''ప్రభూ, యీ విగ్రహాన్ని తయారు చేసింది, ప్రఖ్యాత శిల్పి అయిన మల్హణా చారి. అపురూపమైన కళాఖండాలనెన్ని టినో చెక్కి, తనకు మరెవరూ సాటి రారన్న ఖ్యాతి రావడంతో, అతడిలో అహం కారం తల ఎత్తినట్టున్నది. విగ్రహంలో వున్న లోపాలు అతడికి తెలియపర్చడం అవసరం,'' అని వెంటనే మల్హణాచారిని పిలిపించాడు.

మల్లణాచారి, రాజు ముందుకు వచ్చాడు. రాజు అతడితో, "నువ్వు ప్రసిద్ధి కెక్కిన శిల్పివే కావచ్చు. కాని, మా గురువుగారి విగ్రహాన్ని తయారు చెయ్యడంలో పూర్తిగా విఫలం చెందావు. వారు విగ్రహాన్ని పరీక్షించి, తన స్వరూపానికీ, యీ విగ్రహానికీ అసలు పోలికలే లేవంటున్నారు," అన్నాడు.

మల్లణాచారి ఆశ్చర్యపడుతున్నవాడిలా, ఒకసారి మంత్రికేసి చూసి, రాజుతో, "మహారాజా, రాజగురువుగారి విగ్రహాన్ని, నేను మంత్రిగారు పంపిన చిత్తరువు చూసిన తరవాతే మలచడం ప్రారంభించాను. అయితే, మంత్రిగారు నాకు పంపిన లేఖలో, రాజగురువు సర్వసంగపరిత్యాగి అనీ, విగ్రహాన్ని తయారు చేసేటప్పుడు, ముఖ్యంగా ఆ విషయం గుర్తుంచుకోవలసిందనీ, ఆదేశించారు." అన్నాడు.

"అవును, ఆ మాట నిజమే!" అన్నాడు మార్తాండుడు.

ఈసారి మల్లణాచారి, రాజగురువు కేసి పరీక్షగా చూసి, "సర్వసంగపరిత్యాగులైన మహాపురుషుల రూపురేఖలెలా వుంటవో, నాకు తెలియందికాదు. అందుకే, విగ్రహం వదనంలో ప్రశాంతత, వస్త్రధారణలో నిరాడంబరత, మెడలో రుద్రాక్షమాలలూ, చేతిలో దండకమండలాలవంటిమార్పులు అవసరం అని భావించి—అలా తయారు చేశాను. ఇందుకు మన్నించకోరతాను.



అతిత్వరలో, మంత్రిగారు పంపిన చిత్తరువులో వున్న విధంగా, మరొక విగ్రహాన్ని తయారుచేసి సమర్పించగలను,'' అన్నాడు.

''అలాగే చెయ్యి. కాని, పని మాత్రం చాలా త్వరగా పూర్తికావాలి,'' అన్నాడు రాజు.

మల్లణాచారి, రాజుకు నమస్కరించి వెళ్ళబోతూండగా రుద్రాక్షుడు అతణ్ణి ఆపి, రాజుతో, ''ఆ విగ్రహంలో ఎలాంటి మార్పూ అవసరం లేదు. అంతేకాదు, దాన్నియింత ఆర్భాటంగా నగర మధ్యంలో ప్రతిష్ఠించవలసిన అవసరం కూడా లేదు,'' అన్నాడు.

ఆ మాటలకు అందరూ ఆశ్చర్యపోతూ చూసేంతలో రుద్రాక్షుడు, ''చంద్రహాసా! అలౌకికవిషయాల్లో నేను ఏదో కొంత జ్ఞాన సముపార్జన చేశాను. అలాంటి నేను లౌకికవిషయాల్లో అవసరానికి మించిన జోక్యం కల్పించుకుంటూ, చాలామందికి బాధ కలిగించాను. అందువల్ల, నా నిజ రూపం మరుగునపడిపోయింది. ఆ సంగతి మీలో చాలామంది గుర్తించే వుంటారు. అవునా?'' అన్నాడు.

ఆ ప్రశ్నకు ఎవరూ వెంటనే జవాబివ్వలేదు. కొంతసేపటికి రుద్రాక్షుడు మందహాసంచేసి, ''మంత్రి మార్తాండుడు, శిల్పి మల్లణాచారి ద్వారా, మరుగయిపోయిన నా నిజరూపాన్ని వెతికి తీసి, నాకు ఎంతో మహోపకారం చేశాడు. ఆయన వంటి సమర్థులైన మంత్రులూ, ఇతర రాజోద్యోగులూ నీకు సహాయంగా వుండగా, నా అవసరం ఇక ఈ రాజ్యానికి లేదు. వెలుగులోకి వచ్చిన, నా నిజ రూపం మళ్ళీ మకిలిపట్టి పాడైపోకుండా వుండాలంటే—భగవదారాధనకు మించి నేను చేయగలిగింది మరొకటి లేదు. నన్ను తీర్థయాత్రలకు పంపే ఏర్పాట్లు ఇప్పుడే చేయించు,'' అన్నాడు.

ఆ మర్నాడే రుద్రాక్షుడు రాజప్రాసాదం విడిచి, తీర్థయాత్రలు చేసేందుకు బయలుదేరి వెళ్ళిపోయాడు.





# లోభివర్తకుడు

ఒకానొక గ్రామ సమీపంలోని ఫలవృక్షాలున్న పెద్ద తోటలో, ఒక యోగి పర్ణశాల నిర్మించుకుని నివసిస్తూండేవాడు. ఆయనకు చాలామంది శిష్యులున్నా, దాదాపు అందరూ ఆధ్యాత్మిక విషయాలపట్లకన్న, ప్రాపంచిక విషయాలపట్లే ఎక్కువ ఆసక్తి చూపేవారు. అయినా, యోగి వారికి సుఖశాంతులతో జీవించేందుకు అవసరం అయిన సలహాలు యిస్తూండేవాడు.

ఆయన శిష్యుల్లో ఒక వర్తకుడుండేవాడు. అతడు కరుడుకట్టిన లోభి; పరమ దురాశాపరుడు. లక్షలకొద్దీ ఆస్తి గడించినా, ఒక్కపైసా చేజారిపోవడం జరిగితే, ఆ నష్టం పూడ్చుకోవాలన్న కసితో, ఒక పూట తిండి మానేసేవాడు. మిత్రుల్ని భోజనానికి పిలవడం కానీ, ఏ ధర్మ కార్యానికైనా చందా యివ్వడం గానీ, అతడేనాడూ చేసి ఎరగడు.

ఎప్పుడూ దిగులుగా, దీర్ఘాలోచనలో వున్నవాడిలా కనిపించే వర్తకుణ్ణి, యోగి అప్పుడప్పుడూ, "నువ్వు నవ్వగా ఎప్పుడూ చూడలేదు. కారణం ఏమిటి?" అని అడిగేవాడు.

ఆ ప్రశ్నకు వర్తకుడు మరింత దిగులుగా ముఖంపెట్టి, "స్వామీ, సంతోషంగా నవ్వేందుకేం వున్నది గనక! లోకమంతా దుష్టులమయంగదా. నేనెంత శ్రమించినా, అందుకు తగిన ప్రతిఫలం మాత్రం కరువైపోతున్నది," అనేవాడు.

యోగి అనేకసార్లు, అతడికి—నువ్వు లేనిపోని భయాలతో కుంగిపోతున్నావని చెప్పిచూశాడు. లోకంలో ఎందరో పేదవాళ్ళున్నారు. వాళ్ళు వున్నంతలో తృప్తిపడి కాలం గడిపేస్తున్నారు. నువ్వు కూడా, నీ ధోరణి మార్చుకుంటే సుఖంగా కాలం వెళ్ళబుచ్చగలవు; అని బోధచేశాడు.

మనోజ్ దాస్



యోగి ఆరోగ్యపరిస్థితి శిష్యులకు చాలా ఆందోళన కలిగించింది.

కొంతసేపు తరవాత ఒక్కొక్కరుగా యోగిని దర్శించి, తమను దీవించవలసిందిగా మాత్రం కోరారు.

కట్టకడపట ఆయనను చూడవచ్చిన లోభివర్తకుడు, "స్వామీ, నేనడిగినది ఏదైనాసరే యిస్తానని ముందుగా వాగ్దానం చెయ్యండి," అని కోరాడు.

యోగి యిక ప్రశాంతంగా కన్నుమూయ్యాలన్న ఆతృతలో వున్నాడు. ఆ కారణం వల్ల, ఆయన వర్తకుణ్ణి త్వరగా పంపివేయాలనుకుని, అతడడిగినదానికి సరే అన్నట్టు తల వూపాడు.

అయినా, వర్తకుడిలో చిన్న మెత్తు మార్పు రాలేదు.

ఇలా కొంతకాలం గడిచాక యోగి జబ్బుపడ్డాడు. ఒకనాడు ఆయన శిష్యులందరినీ దగ్గరికి పిలిచి, "త్వరలోనే నేను దేహం చాలించబోతున్నాను. మీరంతా సుఖంగా వుండాలన్నది, నా దీవెన. మీరు ఎల్లవేళలా దేవుడిపై అచంచల విశ్వాసం గలిగి వుండండి. అది మీకు జీవితంలో సుఖశాంతులు కలిగిస్తుంది. అయితే, ఆఖరుసారిగా, మీ సమస్యల గురించి, నా సలహా ఏదైనా అవసరం అనుకుంటే, ఒక్కొక్కరే నా దగ్గరకు రండి," అని చెప్పాడు.

లోభి వర్తకుడప్పుడు, "స్వామీ, మీ పాత శిష్యుల్లో ఒకరు, తమకు కొన్ని అద్భుతశక్తులు కలవని చెప్పాడు. ఇనుమును బంగారంగా మార్చగలరట. ఆ శక్తిని నాకు ప్రసాదించండి!" అన్నాడు.

ఆ కోర్కె విని మరణదశలో వున్న యోగి వెలవెలపోయి, "అయ్యో! అలాంటి శక్తి నాకున్నదనుకుంటున్నావా? కాని ఒకటి గుర్తుంచుకో. ఒకవేళ అలాంటి శక్తి నువ్వు సంపాయించగలిగితే, మరింత మనోక్షోభకు గురికాగలవు. కనక, నీకు నిజంగా మేలు చేయగల దానికోసం నన్నుడుగు," అన్నాడు.

''అలా కాదు, స్వామీ! ఒకసారి ఆ రహస్యం తెలుసుకున్నాక, లోకంలో నా అంతటి సుఖి మరొకడుండడు. మరింత బంగారం, మరింత సుఖం!'' అన్నాడు లోభి వర్తకుడు ధీమాగా.

యోగి యిక అతడికి నీతిబోధ చేసినందువల్ల ఇసుమంత ప్రయోజనం కూడా వుండదని గ్రహించాడు. తక్షణమే వర్తకుణ్ణి అక్కణ్ణించి పంపివేసేందుకు, ఒక మంత్రం చెప్పి, ''ఎలాంటి ఇనుమునైనా సరే తాకి, యీ మంత్రాన్ని నూరుసార్లు జపించు. వెంటనే అది బంగారమైపోతుంది,'' అన్నాడు.

ఆ తరవాత కొద్దిసేపటికి యోగి మరణించాడు. ఆయన శిష్యులందరిలో, లోభి వర్తకు డొకడే ఎంతో సంతోషంగా కనబడ్డాడు.

ఇది చూసిన యితర శిష్యులు, ''యోగి స్వామి, యితడికి, దైవదర్శనం సులభసాధ్యం చేసే అపురూపమైన మంత్రాన్నేదో ఉపదేశించి వుంటాడు. మనకా అదృష్టం లేకపోయింది. స్వామికి, అతడిపట్ల అంత ఆదరం కలగడానికి, ఏదో బలమైన కారణం వుండి వుంటుంది,'' అనుకున్నారు.

వారం రోజుల తరవాత లోభి, తుక్కు ఇనుము కొనుక్కు వచ్చేందుకు బజారుకు వెళ్ళాడు. అక్కడి వ్యాపారి దానికి చెప్పిన ధర లోభికి చాలా అధికం అన్న అభిప్రాయం కలిగింది. ధర తగ్గుముఖం పట్టే



వరకూ ఆగి చూడడం తెలివైనపని— అనుకున్నాడతడు.

ఆ తరవాత వారం, వారం బజారుకు వెళ్ళి దాని ధర విచారించసాగాడు. ధరలో మార్పేమీ లేకపోవడంతో లోభి, "ఈ తుక్కు ఇనుం బంగారంగా మారబోతున్నది గనక, ఎక్కువ ధరపెట్టి కొన్నా నష్టం ఏమీ వుండదు. అయినా, యీ వర్తకుడికి అధిక లాభం ఎందుకు కలిగించాలి? మరి కొంత కాలం వేచిచూస్తాను," అనుకున్నాడు.

ఈ విధంగా రెండు సంవత్సరాల కాలం గడిచిపోయింది. ఏ కారణం వల్లనో తుక్కు ఇనుం ధర హఠాత్తుగా పడి పోయింది.

లోభి వర్తకుడు బజారుకు వెళ్ళి, బండ్లకొద్దీ తుక్కు ఇనుము కొని దాన్ని ఇంటికి చేర్చాడు. అదంతా బంగారం కాబోతున్నది గనక, దాని రక్షణకుగాను ఇంటి మరమ్మతులు ప్రారంభించాడు. ఇందుకుగాను చాలామంది తాపీ పని వాళ్ళనూ, మేస్త్రీలనూ నియమించాడు. ఇసుకా, సున్నం, రాళ్ళలాటి వాటి కొనుగోలు కిందా, పనివాళ్ళకు కూలి రూపంలో, అతడు చాలా ధనం వ్యయం చేశాడు.

ఆఖరుకు ఒకనాటి రాత్రి లోభి, తాను కొని తెచ్చిన తుక్కు ఇనుం మధ్య కూర్చుని మంత్రోచ్చారణ చేయబోయాడు. కాని, మంత్రం గుర్తురాలేదు. అతడు నిరాశతో జుట్టు పీక్కుని, తల గోడకేసి కొట్టుకుంటూ మంత్రం గుర్తు చేసుకునేందుకు ఎంతగానో ప్రయత్నం చేశాడు. కాని, ప్రయోజనం కలగలేదు!

లోభి చేసిన పొరబాటేమంటే—ఈ రెండు సంవత్సరాలకాలంలో, తుక్కు ఇనుము ధర తగ్గుదలా, పెరుగదలలను గురించిన ఎడతెగని ఆలోచనలలో మునిగి తేలుతూ, మంత్రాన్ని పూర్తిగా మరిచి పోయాడు.

ఆ తరవాత కొద్ది రోజులకే అతడికి మతి స్థిమితం తప్పింది. బతికినన్నాళ్ళూ, తుక్కు ఇనుమును కాపలాకాస్తూ కాలం గడిపాడు.






# 16

[కంచుకోటకు వెళ్ళేందుకు రుద్రపురం రాజైన శివసింహుడు చంద్రవర్మకు సహాయపడ్డాడు. చంద్రవర్మ నలుగురు రాజోద్యోగులనూ, కొందరు సైనికులనూ వెంటబెట్టుకుని పడమటి దిక్కుగా బయలుదేరాడు. మార్గంలో వారికి ఒక శిథిలనగరం కనబడింది. అక్కడ కని పించిన శాసనం ద్వారా అది కరవీరపురం అని చంద్రవర్మ తెలుసుకున్నాడు. తరవాత—]

కరవీరపురం శిథిలాలను దాటి పడమటి దిక్కుగా కొంతదూరం ప్రయాణించిన తరవాత హఠాత్తుగా, చంద్రవర్మ మార్గాన ఎత్తయిన పర్వతాలు కనిపించినై. ఆ పర్వతాలను దాటి అవతలి వైపుకు చేరటం కఠిన సమస్యగా పరిణమించింది. పర్వత ప్రాంతమంతా ఎగుడు దిగుడు రాళ్ళమయం. ఆహారపదార్థాలను మోసుకు వస్తున్న కంచరగాడిదలు కాలూని పర్వత పైభాగాన్ని చేరేందుకు ఏమాత్రం అవకాశం లేదు.

"ఎవరు మోయగలిగినన్ని ఆహారధాన్యాలు వాళ్ళు భుజాన వేసుకుని కొండ ఎక్కటం ఒకటే మనకున్న మార్గాంతరం. కంచరగాడిదలను ఈ అడవిలో వదలవలసిందే," అన్నాడు చంద్రవర్మ.

దీనికి మొదట్లో శివసింహుడు పంపిన నలుగురు రాజోద్యోగులూ అభ్యంతరం




మనం కొండ పైకి తాళ్ళతో ఎలా లాగ గలం? కనుక కొంత ఆహార ధాన్యాన్నీ, కంచర గాడిదలనూ ఈ అడవిపాలు చేయవలసిందే, తప్పదు!" అన్నాడు చంద్రవర్మ.

ఈ చెప్పినదానికి ఆ నలుగురు రాజో ద్యోగులూ తప్ప తతిమ్మావాళ్ళు ఆమోదం తెలిపారు.

ఆ వెంటనే గాడిదల మీద నుంచి బరువులు దించి, వాటిలో ఎవరు మోయ గలిగినన్ని వాళ్ళు మూటలు కట్టుకుని, వాటిని తల మీదా, భుజాల మీదా ఎత్తుకుని అందరూ నెమ్మదిగా కొండ ఎక్కటం ప్రారంభించారు.

ఈ కొండ ఎక్కే ప్రయత్నం సూర్యో దయం వేళ ప్రారంభమయింది. సరిగ్గా మిట్టమధ్యాన్నం వేళకు వాళ్ళు కొండ మీద ఒకానొక చదును ప్రదేశాన్ని చేరారు. అక్కడ అన్నాలు వండుకు తిని, కొంచెం సేపు విశ్రాంతి తీసుకున్న తరవాత, తిరిగి కొండ ఎక్కే పని ప్రారంభమయింది. సాయంకాలమై సూర్యాస్తమయం ఒకటి రెండు ఘడియల్లో అవుతుందనగా వాళ్ళు కొండ శిఖరాన్ని చేరారు.

అందరికన్న ముందుగా శిఖరాన్ని చేరిన చంద్రవర్మా, దేవలుడూ తమ కంట బడిన అద్భుత దృశ్యం చూసి

చెప్పారు. "కొండ అవతల ఏమున్నదో మనకు ఏమాత్రం తెలియదు. బహుశా అక్కడ ఆహారపదార్థాలు లభ్యం కాక పోవచ్చు. అలాంటప్పుడు కంచరగాడిదల మీద వున్న ఆహార ధాన్యాల్లో ఎక్కువ భాగం అడవిలో వదిలిపెట్టి, కేవలం మనిషి మోయగలిగినన్ని మాత్రమే తీసు కుని, కొండ అవతలికి వెళ్ళటం ప్రమాద కరం," అన్నారు వాళ్ళు.

"ఈ కొండ ఎక్కేందుకు ఎక్కడా కాలిబాట కూడా వున్నట్టు లేదు. మనమే తాళ్ళు పట్టుకుని వాటి ఆసరాతో అతి కష్టం మీద కొండ ఎక్కవలసి వుంటుంది. అలాంటప్పుడు కంచరగాడిదలను కూడా

మహదానందం పొందారు. కొండకు దిగువగా వారికి ఒక మహానగరం కనిపించింది. ఆ నగరంలోని ఎత్తయిన భవనాల మీద సూర్యకాంతిపడి కళ్ళకు మిరుమిట్లు కొలుపుతున్నది. నగరానికీ, కొండకూ మధ్యనున్న ప్రదేశంలో పండ్లతోటలూ, పంటపొలాలూ సమృద్ధిగా వున్నవి.

ఈ నగరం ఎవరిది? దీని పేరేమిటి? అని చంద్రవర్మ ఆశ్చర్యపడుతున్నంతలో రాజోద్యోగుల్లో ఒకడు వారిని సమీపించి, దిగువనున్న నగరం కేసి చూసి, సంతోషంతో ఉక్కిరిబిక్కిరైపోతూ, "శివపురం! శివపురం!" అని కేకలు పెట్టాడు.




"ఇది శివపురం అని నీకెలా తెలుసు? ఈ పట్టణానికి లోగడ ఎప్పుడైనా వెళ్ళావా?" అని చంద్రవర్మ అతణ్ణి అడిగాడు.

"అయ్యా, ఈ శివపురంలో కొంత కాలం కిందట ఓ నెల రోజులపాటు వున్నాను. ఇది రుద్రపురరాజ్యానికి పడమటి సరిహద్దు మీద వున్న పట్టణం. ఆ తరవాత అంతా పెద్ద ఎడారి. ఈ శివపుర నగరానికి రాజప్రతినిధిగా వుంటున్న వీరమల్లుడు అనబడే ఆయన కూడా నాకు తెలుసు," అన్నాడు రాజోద్యోగి.

"అయితే, నీకు రుద్రపురాన్నుంచి, ఈ పట్టణానికి వెళ్ళే మార్గం బాగా తెలుసన్నమాట! ఆ మాట నాతో ఎన్నడూ అనలేదే!" అన్నాడు చంద్రవర్మ అనుమానంగా.

ఆ ప్రశ్న వింటూనే రాజోద్యోగి కొంచెం బెదురుకుని, "అయ్యా, నేను క్రితంలో ఈ పట్టణానికి వచ్చిన మార్గం యిది కాదు. రాజధానీనగరం రుద్రపురం నుంచి, ఈ శివపురానికి మరేదో మార్గం కూడా ఒకటి వున్నది. అది ఇప్పుడు నాకు బాగా గుర్తు లేదు," అన్నాడు.

చంద్రవర్మ, రాజోద్యోగితో యిలా మాట్లాడుతున్నంతలో కొండకింది నుంచి భేరీ మోగిన ధ్వని వినబడింది. ఆ వెంటనే దానికి ప్రత్యుత్తరంగా పట్టణ ప్రాకారం

లోని ఒక బురుజు మీది నుంచి భీకర మైన ఢంకా నినాదం మార్మోగింది. ఆ క్షణంలోనే విల్లంబులూ, ఈటెలూ ధరించిన కొందరు సైనికులు బురుజు మీదికి వచ్చారు.

తమను శత్రువులుగా భావించి నగర రక్షకులు ఈ సంకేతాలతో హెచ్చరికలు చేసుకుంటున్నారని చంద్రవర్మ గ్రహించాడు. బురుజు మీద వున్న సైనికులు తమ మీద బాణాలు ప్రయోగించకముందే తాము మిత్రులమని వాళ్ళకు తెలియ చెప్పటం అవసరం అని అతడికి తోచింది. వెంటనే చంద్రవర్మ ఒక తెల్లగుడ్డను తన కత్తి మొనతో పైకెత్తి గాలిలో అటూ ఇటూ వూపాడు.

బురుజు మీదికి వచ్చిన సైనికులు ఒక క్షణకాలం కొండ శిఖరానికేసి చూస్తూ నిలబడిపోయారు. అంతలో అజానుబాహు డైన ఒక వ్యక్తి సైనికులను తొలగతోసుకుంటూ ముందుకు వచ్చి, విల్లు ఎక్కుపెట్టి, చంద్రవర్మ కేసి బాణం వదిలాడు. రివ్వుమనే శబ్దంతో బాణం వచ్చి చంద్రవర్మకు కొద్ది దూరాన భూమిలో గుచ్చుకుపోయింది. దానికి ఒక కాయితం కట్టబడి వున్నది.

చంద్రవర్మ ఆత్రంగా బాణం అందుకుని, దానికి కట్టివున్న కాయితాన్ని విప్పి చదివాడు. శివపురం కోటబురుజుల రక్షక దళనాయకుడు, తమ పేరూ, ఊరూ, ఆ ప్రాంతాలకు ఏం పని మీద వచ్చిందీ



తెలపవలసిందిగా అడుగుతున్నాడు. వెంటనే జవాబు రాకపోతే, శత్రువులుగా భావించి సర్వనాశనం చేయగలనని హెచ్చరించాడు.

చంద్రవర్మ, రుద్రపురం రాజు శివసింహుడు తనకు యిచ్చిన ఆజ్ఞాపత్రాన్ని బాణానికి కట్టి, దానిని కోట బురుజు మీద పడేలా వదిలాడు. కొద్దిసేపటికల్లా బురుజుమీద కోలాహలం బయలుదేరింది. చంద్రవర్మనూ, అతడి అనుచరులనూ ఆహ్వానిస్తున్న సూచనగా సైనికులు జయ జయ ధ్వానాలు చేశారు.

కొండ మీది నుంచి నగరం వైపుకు వున్న రాతిమెట్ల మీదుగా చంద్రవర్మా, అతడి వెంట వున్నవారూ నడిచి, కొద్దిసేపటికల్లా, కోట చుట్టూ వున్న అగడ్తను చేరారు. ఆసరికి అక్కడికి కొందరు సైనికులు వచ్చి గుమిగూడారు. చంద్రవర్మ వారిని చూస్తూనే, ఆశ్చర్యానందాలతో ఉక్కిరిబిక్కిరైపోయాడు. అందుకు కారణం: సైనికులకు ముందుగా సేనానాయకుడి దుస్తుల్లో సుబాహుడు అతడి కంటబడటం!

సుబాహుడు కూడా తమ యువరాజైన చంద్రవర్మను తృటిలో గుర్తించగలిగాడు. ఆ వెంటనే అతడు చంద్రవర్మకు హెచ్చరికగా చేయి వూపాడు. దాని భావం: తాము ఒకరి నొకరు గుర్తించినట్టు ఇతరులకు తెలియనివ్వకూడదని. చంద్రవర్మ ఆ సూచనను గ్రహించి, చకచకా ముందుకు





సైనికులూ, చంద్రవర్మ అనుచరులూ కోటలోకి వెళ్ళిపోగానే, సుబాహుడు ఎంతో భక్తిగా చంద్రవర్మకు నమస్కరించి, "మహారాజా! నేను చాలా అదృష్టవంతుణ్ణి. ఈ జన్మలో తిరిగి మీ దర్శనభాగ్యం లభిస్తుందని అనుకోలేదు. ఇంటికి వెళ్ళి అన్ని సంగతులూ మాట్లాడుకుందాం, రండి," అంటూ కోటలోకి దారి తీశాడు.

చంద్రవర్మ సుబాహుడి ఇంటికి వెళ్ళిన కొద్దిసేపటికల్లా, అతణ్ణి గురించి సర్వం తెలుసుకున్నాడు. ఆనాడు సర్పకేతుడి సైనికుల బారిపడకుండా తప్పించుకునేందుకు చంద్రవర్మతోపాటు నదిలోకి దూకిన తరవాత, సుబాహుడు ఒకానొక కొండ లోయలో ఒడ్డుకు చేరి, కొన్నాళ్ళ తరవాత ధీరమల్లుణ్ణిఆకొండల్లోనేకలుసుకున్నాడు. సర్పకేతుడితో జరిగిన ఆఖరిపోరాటంలో ధీరమల్లుడు ఓడిపోయి, మిగిలిన కొద్ది మంది అనుచరులతో అడవుల్లో తల దాచుకోవలసి వచ్చింది. కొన్నాళ్ళకు అందరూ కలిసి రుద్రపురం రాజైన శివసింహుడి కొలువులో చేరి, ఆయన పంపగా శివపురానికి వచ్చారు. శివసింహుడి కొలువులో చేరేప్పుడే ధీరమల్లుడు, తన పేరు వీరమల్లుడని చెప్పుకున్నాడు. ప్రమాదవశాన తన ఉనికి సర్పకేతుడికి

నడిచి, సుబాహుణ్ణి సమీపిస్తూ, సగౌరవంగా అతడికి నమస్కరించి, "మీరు శివపుర సేనానాయకులా? నేను రాజప్రతినిధి వీరమల్లుగారిని కలుసుకోవలసివుంది. వారితో కొన్ని ముఖ్య విషయాలు మాట్లాడాలి," అన్నాడు.

"అదెంత పని. ముందుగా మీకూ మీ అనుచరులకూ ఇక్కడ విడిదీ, భోజన సదుపాయాలూ ఏర్పాటు చేయనివ్వండి. విశ్రాంతి తీసుకున్న తరవాత మీరు రాజప్రతినిధిని చూడవచ్చు," అంటూ సుబాహుడు తన వెంటవున్న సైనికులకు చంద్రవర్మ పరివారాన్ని ఒప్పగించాడు.

తెలియకుండా వుండగలందులకే అతడీ పని చేశాడు.

చంద్రవర్మ కూడా సుబాహుడితోపాటు తను నదిలో దూకిన తరవాత, జరిగిన సంఘటనలన్నీ అతడికివివరంగాచెప్పాడు. అంతా చెప్పిన తరవాత చంద్రవర్మ తను ప్రస్తుతం బయలుదేరిన పనిని గురించి చెపుతూ, కంచుకోట పేరు తేగానే, సుబాహుడు నివ్వెరపోయాడు.



"మహారాజా! మనకు కష్టకాలం పోయి, అదృష్టకాలం సమీపిస్తున్నది. అసలు సంగతి సేనాని ధీరమల్లుడు పట్టణంలో లేడు. ఈ సంగతి మరెవరికీ తెలియకుండా రహస్యంగా వుంచాము. సర్పకేతుడు సైన్యాన్ని వెంటబెట్టుకుని కంచుకోట ప్రాంతానికి వెళుతున్నట్టు మాకు తెలిసింది. అతడి బలాబలాలేమిటో తెలుసుకుని, సాధ్యమైతే అతణ్ణి మార్గమధ్యంలో నాశనం చేసేందుకు సేనాని ధీరమల్లుడు రహస్యంగా కొంత సైన్యాన్ని వెంటపెట్టుకుని రెండు రోజుల క్రితం నగరాన్నుంచి బయలుదేరి పోయాడు," అన్నాడు సుబాహుడు.

సర్పకేతుడి పేరు వింటూనే చంద్రవర్మ ఉద్రేకంతో వూగిపోయాడు. అది గ్రహించిన సుబాహుడు, "మహారాజా! ఈనాడు సర్పకేతుడు మన వీరపురానికేగాక, మొత్తం మాహిష్మతీరాజ్యానికే చక్రవర్తి. యశోవర్ధన చక్రవర్తి మరణించాడు. ఆయన పెద్దకుమారుడు తపోవర్ధనుడు విరాగియై అడవులు పట్టిపోయాడు. తను సహాయం చేస్తానని నమ్మించి, గుణవర్ధనుడితో తన అవసరం తీరిపోగానే, సర్పకేతుడు అతణ్ణి చంపి, మాహిష్మతీ రాజ్యానికి పట్టాభిషేకం చేసుకున్నాడు," అన్నాడు.

"ఇంత రాజ్యం వుండీ ఆ దుష్టుడికి యింకా ధనదాహం తీరలేదన్నమాట. కంచుకోటలో వున్న సంపదల కోసం బయలుదేరాడు!" అన్నాడు చంద్రవర్మ కటువుగా.

''సర్పకేతుడి ఈ జైత్రయాత్రకు ఒక్క ధనదాహమే కాక, రాజ్యకాంక్ష కూడా కారణం అయి వుంటుంది. ఏది ఏమైనా వాడు హఠాత్తుగా ఈ శివపురం మీద దాడి చేయకపోవటం అదృష్టం అనుకోవాలి. చారుల ద్వారా మాకే ముందుగా, వాడే మార్గాన పోతున్నదీ తెలిసింది,'' అన్నాడు సుబాహుడు.

సుబాహుడు యిలా మాట్లాడుతున్నంతలో దూత ఒకడు హడావిడిగా అక్కడికి వచ్చి అతడి చేతికి ఒక పత్రం యిచ్చాడు. సుబాహుడు దాన్ని విప్పి చదువుతూనే వెలవెలపోయి, పూర్తిగా చదివిన తరవాత పత్రాన్ని చంద్రవర్మ చేతికి అందించాడు.

చంద్రవర్మ ఆ పత్రాన్ని చదివాడు. అది సేనాని ధీరమల్లుడు సుబాహుడికి రాసింది. అందులో వున్న విషయం యిది: ధీరమల్లుడు తన కొద్ది సైన్యంతో, సర్పకేతుడి గొప్ప సైన్యసమూహాన్ని శివపురానికి ఉత్తరంగా వున్న ఎడారి ప్రదేశంలో కలుసుకున్నాడు. సర్పకేతుడి వెంట వున్న అన్ని వేలమంది సైనికులతో, తను ముఖాముఖిని పోరాడటం ఎంతో ప్రమాదకరం అని అతడు గ్రహించి వెనుతిరగబోయేంతలో, సర్పకేతుడికి ఈ సంగతి కాస్తా తెలిసిపోయింది. అతడు కొంత సైన్యాన్ని వెంటపెట్టుకుని ధీరమల్లుడి వెంటబడ్డాడు. ధీరమల్లుడు తన కొద్దిపాటి సైన్యంతో శివపురం కేసి పారిపోయి వస్తున్నాడు. ఆ కారణంవల్ల సుబాహుణ్ణి నగరంలో కొద్దిపాటి సైన్యాన్ని వుంచి, మిగిలిన సేనతో వెంటనే తనకు సహాయం రావలిసిందిగా అతడు కోరాడు.

''ఇది అనుకోని దుర్ఘటన, మహారాజా! సేనాని ధీరమల్లుడు ఈ నగర రక్షణలను చేరుకోకముందే, సర్పకేతుడితో అతడికి యుద్ధం తప్పకపోతే, అది మొదట ధీరమల్లుడి ఓటమికీ, తరవాత ఈ నగర నాశనానికీ దారి తీస్తుంది. మనం సేనతో అతడికి రక్షణగా వెళ్ళటం మంచిది,'' అన్నాడు సుబాహుడు. —(ఇంకావుంది)






# నాగకన్య

పట్టువదలని విక్రమార్కుడు చెట్టు వద్దకు తిరిగి వెళ్ళి, చెట్టుపై నుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానం కేసి నడవసాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, "రాజా, ఇంత నిశిరాత్రివేళ, ఏ స్వప్రయోజనాన్ని ఆశించి యిలా శ్రమలపాలవుతున్నావో అర్థం కావడం లేదు. కాని, ఒక సంగతి గుర్తుంచుకో! లోకంలో ఎందరో అమాయకులు, వచ్చిన అవకాశాన్ని ధీరచంద్రుడిలా జారవిడుచుకుంటారు. నువ్వూ, అలాంటి వాడివేమోనన్న అనుమానం కలుగుతున్నది. అతడి కథ చెబుతాను, శ్రమ తెలియకుండా విను," అంటూ యిలా చెప్పసాగాడు.

ఒక రోజున కౌముది అనే నాగకన్య, తొలిసారిగా పాతాళం నుంచి బయటికి వచ్చి, ఒక నదీతీరాన మానవరూపంలో

## బేతాళ కథలు



విహరించసాగింది. భూలోకపు వాతావరణం ఆమెకెంతో ఆహ్లాదకరంగా వున్నది.

"ఆహాఁ! మానవులెంత అదృష్టవంతులు," అని అనుకుంటూండగా, ఆమె కంటికి ఒక యువకుడు కనిపించాడు.

ఆ యువకుడి పేరు ధీరచంద్రుడు. ఒకానొకప్పుడు బాగా బతికి, చితికిపోయిన కుటుంబం వాడిది. ప్రస్తుతం వాడి తల్లికి ఆరోగ్యం చెడింది. వైద్యానికి డబ్బు కావాలి. రెండు సంవత్సరాల క్రితం పంటలు పండక చేసిన అప్పు, వడ్డీతో సహా తడిసి మోపెడయింది. ఈ ఏడు కూడా, గత సంవత్సరం పండిన పంటలు ఇంటి ఖర్చులకు చాలక, మరి కొన్ని అప్పులు చేశాడు. అప్పులవాళ్ళ బాధలు భరించలేక, అతడి తండ్రి ఆరుమాసాల క్రితం ఇల్లు వదిలి పారిపోయాడు.

ఇక చేసేదిలేక ధీరచంద్రుడు వారం రోజుల కిందట తాతలనాటి ఇంటిని అప్పులు తీర్చడం కోసం అమ్మేశాడు. దురదృష్టవశాత్తూ, ఆ రాత్రే వాడింట్లో దొంగతనం జరిగింది. డబ్బు పోయింది. ఇల్లు కొన్నవాడు, ఖాళీ చేయడానికి వారం రోజులు వ్యవధి యిచ్చాడు. అది యీ రోజుతో ముగుస్తుంది!

రోగిష్ఠి తల్లి, అప్పులబాధ—ఈ రెంటికీ తోడు, నిలువ నీడలేని పరిస్థితి! రేపటి నుంచి ఏమి చేయాలి, అన్న దిగులుతో ధీరచంద్రుడు, నది వద్దకు వచ్చి కూర్చున్నాడు. నాగకన్య కౌముది, ధీరచంద్రుడి ముఖంలోని దిగులు గమనించలేదు. వాడి అందాన్ని చూసి అచ్చెరువంది, "నరుడికెంత అందమో!" అనుకున్నది.

కౌముది చాలాసేపు వాడినే చూస్తూ నిలబడిపోయింది. ఆలోచనల్లో మునిగి వున్న ధీరచంద్రుడు ఆమెను గమనించలేదు. చివరకు ఆమె వాణ్ణి పలకరించింది.

ధీరచంద్రుడు ఉలిక్కిపడి నాగకన్యను చూసి, "ఎవరు నువ్వు?" అని అడిగాడు.

"నా పేరు కౌముది. నేనొక నాగకన్యను," అని ధీరచంద్రుడి విచారాన్ని



గమనించి, "ఎందుకలా వున్నావు?" అని అడిగింది.

ధీరచంద్రుడామెకు తనను గురించి చెప్పుకున్నాడు. అంతా విన్న నాగకన్య, "నేను నిన్ను ప్రేమించాను. నాతోపాటు నాగలోకానికి వస్తావా?" అని అడిగింది.

నాగకన్య మాటలకు ధీరచంద్రుడు ఆశ్చర్యపోయి, ఒక క్షణం ఆగి, "నా సమస్యలేవో చెప్పాను గదా? నేనిప్పుడెక్కడికీ రాలేను," అన్నాడు.

నాగకన్య వెంటనే, "నీ సమస్యలు డబ్బుతో ముడిపడి వున్నవి. నీ క్కావలసినంత బంగారం తెచ్చివ్వగలను. ఇక్కడే వుండు!" అని మాయమైంది.

జరిగింది కలా, నిజమా అని ధీరచంద్రుడు ఆలోచించసాగాడు. అయితే, కొద్ది క్షణాల్లో నాగకన్య వాడి ముందు ప్రత్యక్షమై, ఒక మూట యిచ్చింది. అందులో బంగారుకాసులే కాక విలువైన మణులున్నవి.

"ఈ డబ్బుతో, నీ అప్పుల బాధతో పాటు, మరేవైనా బాధ్యతలుంటే నెరవేర్చుకుని, వచ్చే దశమినాటికి నది ఒడ్డుకురా. మాట తప్పావో, నీ కుటుంబాన్ని సర్వనాశనం చేస్తాను," అన్నది నాగకన్య.

ఆ రోజుతో వాడి జాతకం తిరిగిపోయింది. నాగకన్య యిచ్చిన ధనం మూటలోని, ఒక్క మణి అమ్మితే, వాడికి లక్షవరహాలు వచ్చాయి. దానితో వాడు అందమైన భవనం కొన్నాడు. అప్పులన్నీ తీర్చేశాడు. దాసదాసీజనాన్ని ఏర్పాటు చేసుకున్నాడు. తల్లికి మంచి వైద్యుణ్ణి కుదిర్చాడు.

ఆ వైద్యుడు వైద్యం ప్రారంభించిన రెండు దినాలకే, ధీరచంద్రుడి తల్లి వ్యాధి తిరుగుముఖం పట్టింది.

అప్పుడామె, కొత్త ఇంటినీ, తనకు సేవ చేస్తున్న దాసదాసీలనూ చూసి ఆశ్చర్యపడి, ధీరచంద్రుణ్ణి, "మన పరిస్థితిలో యింత మార్పు ఎలా వచ్చిందిరా, బాబూ?" అని అడిగింది.



ధీరచంద్రుడు ఏమీ దాచకుండా, జరిగినదంతా తల్లికి చెప్పాడు.

ఆమె అంతా విని భయంగా, "నాగకన్యలతో పొత్తు చాలా ప్రమాదం. నువామెను ఎలాగైనా వదిలించుకోవాలి. నా తమ్ముడు శూరగుప్తుడు, నీకేదైనా సలహా యివ్వగలడు. వెళ్ళి అడుగు!" అన్నది.

ధీరచంద్రుడి తల్లి, శూరగుప్తుడి పేరు చెప్పడానికి ఒక కారణం వున్నది. కష్టాలలో వున్నంతకాలమూ, శూరగుప్తుడు ధీరచంద్రుడి ఇంటి ఛాయలకు కూడా రాలేదు. అతడు పరమస్వార్థపరుడు. అయితే, అతడికి ధీరచంద్రుడికి ఈడైన కూతురున్నది. ఇప్పుడు ధీరచంద్రుడి పరిస్థితి బాగుపడింది కనక, తప్పకుండా తన కూతురును, అతడికిచ్చి పెళ్ళి చేయాలని భావిస్తాడు! ఇలాంటి సందర్భాలు వచ్చినప్పుడు, స్వార్థపరులు సాయపడినట్టుగా, మరెవ్వరూ సాయపడలేరు.

అంతా ధీరచంద్రుడి తల్లి అనుకున్నట్టే జరిగింది. తన మేనల్లుడు, తనను మించిన భాగ్యవంతుడయ్యాడని తెలిసి, శూరగుప్తుడు వాణ్ణి ఎంతగానో ఆదరించి, సంగతి విని, "నాగకన్యను వదుల్చుకునేందు కొక ఉపాయం వున్నది. నీ తల్లి జబ్బు నయం కావడం లేదనీ, అందుకు నాగమూలిక కావాలనీ చెప్పు. నాగకన్య ఆ మూలిక తేలేదు," అన్నాడు.

దశమినాడు ధీరచంద్రుడు నది ఒడ్డున నాగకన్యను చూడబోయి, శూరగుప్తుడు చెప్పమన్నది చెప్పాడు.

నాగకన్య వెంటనే, "నా ఆయువు వెయ్యి సంవత్సరాలు. నీకు నాగమూలికను తెచ్చి యివ్వడం వల్ల, అది సగానికి సగం తగ్గిపోతుంది. నువ్వు లేని నా జీవితం వ్యర్థం. అందువల్ల, నా ఆయువు తగ్గిపోయినా, ఆ మూలిక తెచ్చి యిస్తాను. దానితో, నరులకు సంబంధించిన ఏ వ్యాధి అయినా నయమవుతుంది," అన్నది.

అన్నప్రకారం నాగకన్య మూలిక తెచ్చి ధీగచంద్రుడికి యిచ్చింది. దానితో

తల్లి వ్యాధి నయం చేసుకుని, రానున్న పౌర్ణమికి నాగలోక ప్రయాణానికి సిద్ధం కమ్మని, వాడితో చెప్పి, వెళ్ళిపోయింది.

ఆ మూలిక కారణంగా, ధీరచంద్రుడి తల్లి జబ్బు చేత్తో తీసినట్టు వెంటనే కుదిరిపోయింది. అయితే, వాడి తల్లి అందుకు సంతోషించక, శూరగుప్తుడికి కబురు పెట్టింది.

శూరగుప్తుడు వచ్చి విషయం తెలుసుకుని, ధీరచంద్రుడితో, "నీ తల్లిని ఒంటరిదాన్ని చేసి ఎలా వెళతావు? ఎక్కడికో పారిపోయిన, నీ తండ్రి తిరిగి వచ్చే వరకూ, నాగలోకానికి రాలేనని ఆమెతో చెప్పు," అని సలహా యిచ్చాడు.

ధీరచంద్రుడు అలాగే చేశాడు. అప్పుడు నాగకన్య విచారంగా, "నీ తండ్రి ఎక్కడ వున్నదీ తెలుసుకుని, తిరిగి మీతో కలపడానికి, నా ఆయువులో నూరు సంవత్సరాలు వదులుకోవాలి. అయినా, నీ కోసం అది చేయగలను," అన్నది.

తర్వాత ఆమె, ధీరచంద్రుణ్ణి రానున్న పంచమినాడు నాగలోకానికి రమ్మని చెప్పింది.

ఆ రాత్రే ధీరచంద్రుడి తండ్రి ఇంటికి తిరిగి వచ్చాడు. భర్త వచ్చినందుకు సంతోషించడానికి బదులు, కొడుకు దూరమౌతాడని, ధీరచంద్రుడి తల్లి బెంగపెట్టు



కున్నది. తిరిగి శూరగుప్తుడే మరొక సలహా యిచ్చాడు. దాని ప్రకారం ధీరచంద్రుడు నాగలోకానికి వెళ్ళడం సాధ్యపడదు. నరులు ఏకపత్నీవ్రతులు. భార్య పుట్టింటి నుంచి అత్తవారింటికి వచ్చి కాపరం చేయడం, వారి ఆచారం. నాగకన్య ధీరచంద్రుణ్ణి ప్రేమిస్తున్నట్టయితే — ఆమె అతణ్ణి పెళ్ళి చేసుకుని, అత్తవారింటికి రావలసి వుంటుంది.

శూరగుప్తుడు, యీ నియమాలు పెట్టమని ధీరచంద్రుడికి చెప్పి, "నాగకన్య మానవులమధ్య వుండలేదు. అందువల్ల, ఆమె దీనికి అంగీకరించలేదు. ఒకవేళ ఆమె అంగీకరించడం జరిగితే — ఈ



''కావాలంటే నిన్ను బలవంతంగా తీసుకువెళ్ళగలను. సరే, నీ కోసం నా సర్వశక్తులూ, మహిమలూ పోగొట్టుకునేందుకు సిద్ధంగా వున్నాను. నీ యిష్ట ప్రకారమే కానీ!'' అన్నది నాగకన్య.

ఆమె అంగీకారం విని ధీరచంద్రుడు తెల్లబోయి, ''మహిమలు పోగొట్టుకుంటే, నేను నిన్ను బాధిస్తానన్న భయం లేదా?'' అని అడిగాడు.

''నేను, నిన్ను ప్రేమించాను. అలాంటి నన్ను ఎందుకు బాధిస్తావు?'' అన్నది నాగకన్య.

''అందుకు కారణం వున్నది. నా తండ్రి గరుడవంశానికి చెందినవాడు. నాతల్లికోసం ఆయన తన లోకం వదిలి, భూలోకం వచ్చి స్థిరపడ్డాడు. నాలో ఆయన అంశ వున్నది,'' అన్నాడు ధీరచంద్రుడు.

ఆ వెంటనే నాగకన్య, ''గరుడులకూ, నాగులకూ జాతివైరం వున్నమాట నిజమే. కాని, నేను నిన్ను ప్రాణాధికంగా ప్రేమించాను. నీ భార్యగా వుండడం కోసం, నా ప్రాణాలను కూడా లెక్కచెయ్యను,'' అన్నది.

ధీరచంద్రుడు ఆ జవాబు విని చలించిపోయి, ''నేను నీతో నాగలోకానికి వచ్చేస్తాను. మనం అక్కడే సుఖంగా వుందాం,'' అన్నాడు.

అఖరు ఉపాయం ప్రయోగించు!'' అని అదేమిటో చెప్పాడు.

పంచమినాడు ధీరచంద్రుడు, నది ఒడ్డున నాగకన్యను కలుసుకుని, భూలోకపు నియమాలు చెప్పాడు.

''నేను నిన్ను పెళ్ళి చేసుకుని, మీ ఇంటికి వచ్చేస్తే, నాకిక నాగలోకంతో సంబంధం వుండదు. నాకున్న శక్తులన్నీ పోతాయి. అందుకే నిన్ను కొంతకాలం, మా లోకానికి తీసుకుపోదామనుకున్నాను,'' అన్నది నాగకన్య విచారంగా.

''మా నరుల సంప్రదాయానికది సరిపడదు. నన్ను మన్నించు!'' అన్నాడు ధీరచంద్రుడు.

బేతాళుడు ఈ కథ చెప్పి, "రాజా, స్వప్రయోజనం కొద్దీ ధీరచంద్రుడు, నాగకన్యకు చాలా నియమాలు పెట్టాడు. వాటన్నిటికీ నాగకన్య ఒప్పుకున్నది. అలాంటప్పుడు, అతడామెను ఇంటికి తీసుకుపోయి వివాహమాడవలసింది. అలా చేయక, నాగకన్యతోపాటు నాగలోకానికి వెళ్ళిపోయాడు. తీరా కార్యసిద్ధి జరిగాక, అతడలా ప్రవర్తించడం అమాయకత్వమనిపించుకోదా? ఈ సందేహానికి సమాధానం తెలిసి కూడా చెప్పకపోయావో, నీ తల పగిలిపోతుంది." అన్నాడు.

దానికి విక్రమార్కుడు, "నువ్వనే నియమాలన్నీ స్వార్థబుద్ధితో కల్పన చేసినవాడు, ధీరచంద్రుడి మేనమామ. వాటన్నిటికీ నాగకన్య తన అంగీకారం తెలిపాక, ధీరచంద్రుడికి లోకంతీరు అర్థమైంది. తల్లిదండ్రులకూ, మేనమామకూ— అందరికీ డబ్బు ముఖ్యం. డబ్బు లేక అతడి తండ్రి తల్లిని విడిచి పారిపోయాడు. ధీరచంద్రుడి దగ్గర డబ్బు చేరగానే, ఎంతోకాలంగా మేనల్లుడి సంగతి పట్టించుకోని మేనమామ, అతడి శ్రేయోభిలాషి అయ్యాడు. నాగకన్య వాళ్ళకు డబ్బు యివ్వడమే గాక, తన ఆయువును కూడా కొంత ధారపోసింది. అయినా వాళ్ళు కృతజ్ఞత చూపడానికి బదులు, ఆమెను మోసం చేయాలని చూశారు. తనను వివాహం ఆడి ఈ లోకంలో వుంటే, ఎన్నో కష్టాలు రానున్నవని భయపెట్టినా, నాగకన్య ధీరచంద్రుణ్ణి వివాహమాడడానికి ఒప్పుకున్నది. ఇది చూశాక, అతడికి నాగకన్య తనను ఎంతగా ప్రేమించిందో అవగాహన కావడమేగాక, తన బంధువులు ఎలాంటి నీచబుద్ధులో తెలిసి వచ్చింది. ఈ కారణం వల్లనే అతడు, ఆమె వెంట నాగలోకానికి వెళ్లడానికి ఒప్పుకున్నాడు. అంతేగాని, అమాయకత్వం వల్ల మాత్రం కాదు," అన్నాడు.

రాజుకు ఈ విధంగా మౌనభంగం కలగగానే, బేతాళుడు శవంతో సహా మాయమై, తిరిగి చెట్టెక్కాడు. —(కల్పితం)



# రోగనిర్ణయం!

వైద్యుడుగా మంచి పేరు పొందిన కృపానందం అనే ఆయన, వచ్చిన రోగుల నాడీపరీక్ష చేసి, "ఇది చాలా ముఖ్యం! గత నాలుగు రోజులుగా, మీరేం కూరలు తిన్నారో చెప్పండి. ఆ కూరలే, మీ అనారోగ్యానికి కారణం అయి వుండొచ్చు," అనేవాడు.

తరవాత రోగి చెప్పిన కూరల పేర్లు జాగ్రత్తగా విని, "ఓహో, యింకేం, అర్థమైంది! సరే, యీ మందు వాడండి," అని మందు యిచ్చి, డబ్బు తీసుకునేవాడు.

ఆయన దగ్గిర వైద్యం నేర్చుకోవడానికి వచ్చిన రత్నాచారి అనే యువకుడు, తన గురువుగారి ధోరణి కొన్నాళ్ళు గమనించి, ఒకనాడు, "గురుదేవా, వచ్చిన రోగులు గత నాలుగు రోజుల్లో తిన్న కూరల విషయం ప్రశ్నిస్తూంటారు. రోగనిర్ణయానికి అదంత ముఖ్యమా?" అని అడిగాడు.

ఆ ప్రశ్నకు కృపానందం నవ్వి, "వాళ్ళు వండుకున్న కూరలు, వాళ్ళ ఆర్థికస్తోమతును తెలుపుతాయి గదా! దాన్నిబట్టి, వాళ్ళ నుంచి ఎంత డబ్బు రాబట్టాలో నిర్ణయించుకుంటాను," అన్నాడు.

—ఎం. డి. సౌజన్య






మన దేవాలయాలు :

# కాళీఘట్

చాలాకాలం కిందట ఆత్మారాముడనే బ్రాహ్మణుడు, రోజూ అరణ్య సమీపంలోని గంగాతీరం చేరి కొంతసేపు ధ్యానంలో గడిపేవాడు. అతడు అరణ్య పరిసర గ్రామంలో నివసిస్తూండేవాడు.

ఒక రోజు సాయంకాలం ఆత్మారాముడు ధ్యానం ముగించి లేవగానే, గంగా ప్రవాహం నుంచి ఒక వింత వెలుగు రేఖ పైకి రావడం కనిపించింది. అతడు అమితాశ్చర్యం చెందాడు. అయినా చీకటి అలముకుంటూ ఉండడం వల్ల, అక్కడికి పోలేక పోయాడు.





ఆ రాత్రంతా ఆత్మారాముడికి నిద్ర పట్టలేదు. ఆ సాయంకాలం కనిపించిన వెలుగురేఖను గురించే ఆలోచించ సాగాడు. మర్నాడు వేకువజామున గంగాతీరాన్ని చేరాడు. నిన్న కనిపించిన ప్రకాశం ఇంకా అలాగే ఉన్నది. అతడు దాని దగ్గరకు వెళ్ళి చూశాడు. నీళ్ళలో తళతళలాడే ఒక శిలాహస్తం కనిపించింది.




ఆత్మారాముడు దానిని ఇంటికి తీసుకు పోయాడు. ఆ రాత్రి అతడు ఒక అద్భుతమైన కల గన్నాడు: యజ్ఞానికి వచ్చిన సతీదేవిని చూడగానే, దక్షుడు మండిపడి శివుణ్ణి నానా దుర్భాషలాడడంతో, సతీదేవి సహించలేక యజ్ఞ వాటిక సమీపంలో స్పృహతప్పి పడి పోయింది.

మరణించిన సతీదేవి దేహాన్ని భుజాన వేసుకుని, శివుడు బాధతో, సర్వం మరచి భూలోకమంతా, ఎక్కడెక్కడో తిరగసాగాడు. ఆయన్ను ఎవరూ ఆపలేక పోయారు.





ఆఖరికి విష్ణువు తన సుదర్శన చక్రం ప్రయోగించాడు. విష్ణుచక్రం సతీదేవి దేహాన్ని ముక్కలు చేసింది. ఆమె ఒక్కొక్క అంగం ఒక్కొక్క ప్రాంతంలో పడింది. ఆమె చేతుల్లో ఒకటి ఈ అరణ్యప్రాంత గంగా నదిలో పడింది.

తనకు దొరికిన శిలాహస్తం సతీదేవిదే అని ఆత్మారాముడు గ్రహించాడు. అతడు దానిని కాళీమాత విగ్రహంలో ప్రతిష్ఠించి, అరణ్యంలోనే ఒక కుటీరం ఏర్పరచి పూజించసాగాడు.





దేవీ కుటీరం అరణ్య మధ్యంలో ఉండడం వల్ల, చాలా కాలంవరకు దానిని గురించి ఎవరికీ తెలియలేదు. ఒకనాడు ఒక జమీందారు గంగా నదిలో పడవ ప్రయాణం చేస్తూ, అరణ్య మధ్యం నుంచి శంఖానాదం రావడం గమనించాడు.

జమీందారు పడవ దిగి, అడవిలోకి వెళ్ళాడు. కాళీ విగ్రహం ముందు కొందరు మునులు కూర్చుని ఉండడం చూసి. అతడు ఎంతో ఆశ్చర్యం చెందాడు: ఆయన కాళికాదేవి విగ్రహానికి సాష్టాంగ నమస్కారం చేశాడు.






మునుల అనుమతి పొంది, జమీందారు దేవికి ఆలయం నిర్మించాడు. రోజూ చాలామంది భక్తులు రాసాగారు. కాల క్రమంలో దాని చుట్టూ ఉన్న అరణ్యం కనుమరుగయింది. పూజారులూ, వ్యాపారులూ ఆలయం చుట్టూ గృహాలు నిర్మించుకున్నారు.

ఆలయనిర్మాణం మరింత విస్తృతం కాగానే, ప్రజలు తండోపతండాలుగా రాసాగారు. తరచూ ఉత్సవాలు, ఊరేగింపులు జరగసాగాయి. పద్దెనిమిదవ శతాబ్దానికల్లా ఆ స్థలం కాళీఘట్ అనే నామంతో సుప్రసిద్ధమయింది.





కాళీఘట్ అన్న మాటే కాలక్రమాన కలకత్తాగా మారిందని చెబుతారు. ఈస్టిండియా కంపెనీ రాకతో కలకత్తా మరింత వేగంగా అభివృద్ధి చెంది, ఈనాడు మన పెద్ద నగరాలలో ఒకటిగా వెలుగొందుతున్నది.



# వింత భార్య

బొగ్దాదు నగరంలో సిదీనుమాన్ అనే ఒక యువవర్తకుడు ఉండేవాడు. అతడు అపురూప సౌందర్యవతి అయిన ఒక యువతిని చూసి, ఆమె అందానికి ముగ్ధుడై, ఆమె పుట్టు పూర్వోత్తరాలయినా విచారించకుండా వివాహం చేసుకున్నాడు. ఈ విషయంలో సిదీనుమాన్ కనీసం తన బంధుమిత్రులను కూడా సంప్రదించలేదు.

నుమాన్ ఒక పెద్ద మేడను అద్దెకు తీసుకుని, భార్యతోపాటు అందులో కాపురం పెట్టాడు. మొదటి రెండు రోజులూ సంతోషంగా గడిచిపోయాయి. అయితే భార్య భోజనం దగ్గర కూర్చున్నా, ఏమీ తినకుండా ఉండడం చూసి నుమాన్ ఆశ్చర్యపడ్డాడు. ఆమెను తినమని చెప్పాడు, కాని ఆమె అతని మాటలు పట్టించుకోలేదు.

ఇలా పదిరోజులు గడిచినా, ఒక్క పూటయినా భార్య భోజనం చేయడం భర్త చూడలేదు. అయినా ఆమెలో ఏ మాత్రం నీరసం కనిపించలేదు. మామూలుగా ఉత్సాహంగా కనిపిస్తున్నది. ఆమె తనకు తెలియకుండా రహస్యంగా భోజనం చేస్తున్నదా? అయితే ఎందుకు అలా చేయాలి? అన్న అనుమానం భర్తకు కలిగింది.

ఒకనాడు రాత్రి, భార్య ఏమి చేస్తుందో కనిపెట్టాలనుకుని నుమాన్, పడక మీద నిద్రిస్తున్నట్టు కళ్ళు మూసుకుని పడుకున్నాడు. అయితే నిద్రపోలేదు. సరిగ్గా అర్ధరాత్రి కాగానే ఆ యువతి పడక నుంచి లేచి చప్పుడు చేయకుండా, బయటికి వెళ్ళడం నుమాన్ గమనించాడు. ఆమె వెళ్ళిన కొంతసేపటికి, అతడూ ఆమెను నిశ్శబ్దంగా వెంబడించాడు.

అరేబియా కథ



అతడు అక్కడినుంచి వెనుదిరిగి, ఇంటికి వచ్చి యథాప్రకారం నిద్రపోతున్నట్టు పడుకున్నాడు. ఒక గంటసేపు తరవాత ఆయువతి రావడం అతడు గమనించాడు. తన భార్యను మంచి మార్గంలో పెట్టడం ఎలాగా అన్న సమస్య అతణ్ణి వేధించసాగింది.

మర్నాడు భోజనానికి కూర్చున్నప్పుడు, నుమాన్ అతని భార్యను, "నీకు ఎటువంటి ఆహారం కావాలన్నా కొనడానికి కావలసినంత ధనం నా దగ్గర ఉన్నది. అటువంటప్పుడు నువు అర్ధరాత్రిలో లేచి, చీకటిలో పడి శ్మశానం దాకా వెళ్లవలసిన అవసరం ఏమిటి?" అని అడిగాడు నెమ్మదిగా.

ఆ మాటలు వినగానే నుమాన్ భార్య కళ్ళు కోపంతో నిప్పు కణాల్లా అయ్యాయి. తన రహస్యం తెలిసి పోయిందని గ్రహించిన వెంటనే, ఆమె ఒక లోటాలోని నీళ్ళను మంత్రించి, నుమాన్ మీద చల్లింది.

నుమాన్ మరు క్షణమే కుక్క అయిపోయాడు! అక్కడి నుంచి ప్రాణాలతో తప్పించుకోవాలని బయటికి పరుగు పట్టాడు. కుక్క మెడను తలుపు సందులో అదిమి చంపాలని ఆ యువతి ప్రయత్నించింది. అతడు తప్పించు

ఆమె చీకటిలో పడి నగరానికి దూరంలో ఉన్న శ్మశానం కేసి నడవసాగింది. శ్మశానాన్ని అనుకుని ఉన్న మొండిగోడ మీద కూర్చుని ఉన్న ఒక దయ్యం, ఆమె దగ్గరికి రాగానే చేయి అందించింది. అమితానందంతో అ యువతి, ఆ దయ్యం చేయి పట్టుకుని, గోడమీదికెక్కి అవతలికి దూకింది. తరవాత ఇద్దరూ కనిపించలేదు.

ఆ దృశ్యం చూసి నుమాన్ దిగ్భ్రాంతి చెందాడు. ఆ దయ్యమూ, తన భార్యా కలిసి గోడ కవతల ఎటువంటి ఆహారం తీసుకుంటున్నదీ ఊహించడానికైనా అతనికి ధైర్యం చాల లేదు.

కున్నాడు. అయినా తలుపు సందులో నగం తోక మాత్రం తగులు కొని, అంత వరకు తెగిపోయింది.

ఇంటి నుంచి బయట పడి పరిగెత్తు తున్న, ఆ కుక్కను చూసి, వీధిలోని కుక్కలు తరమసాగాయి. వాటి నుంచి తప్పించుకోడానికి, ఆ కుక్క, ఒక దుకాణంలోకి చొరబడింది. ఆ దుకాణం యజమాని దయాగుణం కలవాడు కావడం చేత, వీధి కుక్కలను తరిమివేసి దానిని కాపాడాడు. ఆ కుక్క కృతజ్ఞతతో తోక ఆడిస్తూ, అమాయకంగా చూస్తూ ఆ వ్యాపారి ప్రేమకు పాత్రమయింది. అక్కడే కాలం గడపసాగింది.

ఒకనాడు సరుకులు కొనడానికి దుకాణానికి వచ్చిన ఒక స్త్రీ, తాను కొన్న సరుకులకు డబ్బు చెల్లించింది. అందులో ఒక నాణెం చెల్లదని వ్యాపారి చెప్పాడు. అతడలా అన్నందుకు ఆమెకు పట్టరాని కోపం వచ్చింది. ఆవిడ కోపం చూసిన వ్యాపారి, "దీనికెందుకు అలా కోప్పడతారు. అది నకిలీ నాణెం అనే విషయం, నా కుక్క కూడా చెప్పగలదు," అన్నాడు ఆమెతో.

"అలాగా! ఏదీ చెప్పమనండి చూద్దాం." అంటూ ఆవిడ తన దగ్గరున్న నాణాలను నేల మీదికి విసిరింది.



కుక్క తన కాళ్ళతో వాటిలోని మంచి నాణాల నన్నిటినీ తీసి అవతల పెట్టి, నకిలీ నాణాన్ని మాత్రం ముట్టుకోలేదు.

కుక్క తెలివికి ఆమె ఎంతగానో ఆశ్చర్యం చెందింది.

తన కుక్క నకిలీ నాణాలను కనిపెట్టే విషయం ఆ వ్యాపారి అందరితోనూ గొప్పగా చెప్పుకోసాగాడు. కొందరు వ్యాపారులు కావాలనే, మంచి నాణాలతో దొంగ నాణాలను కలబోసి, కుక్క ముందు ఉంచేవారు. కుక్క క్షణాలలో నకిలీ నాణాలను వేరు చేసి చూపేది!

ఒకనాడు మధ్యాహ్నం, వ్యాపారి దుకాణానికి కావలసిన సరకులను దించే

హడావిడిలో ఉన్నాడు. ఆ సమయంలో ఒక ముసలావిడ అక్కడికి వచ్చి, కుక్కను తన వెంట రమ్మని సైగ చేసింది. అదే విధంగా కుక్క ఆమె వెంట వెళ్ళింది.

ఆ ముసలావిడ ఇల్లు చేరగానే, "అమ్మాయీ! కుక్క నకిలీ నాణాలను కనిపెట్టడం ఎక్కడయినా విన్నావా! ఏ మంత్రగాడో, మంత్రగత్తో మనిషిని ఇలా కుక్కగా మార్చి ఉంటారని నాకు అనుమానంగా ఉంది. ఈ కుక్కను కాస్త చూడు తల్లీ," అన్నది తన కుమార్తెతో.

ఇరవై సంవత్సరాల వయసు ఉన్న ఆమె కూతురు ఇంటి నుంచి బయటకు వచ్చి, కుక్కను కొంతసేపు పరిశీలనగా చూసింది. తరవాత కూజాలోని జలం తీసుకుని ఏవో మంత్రాలు చదివి, ఆ మంత్ర జలాన్ని కుక్క మీద చిలకరించింది.

మరుక్షణమే కుక్క రూపం మాయమై, నుమాన్ మునుపటి మానవరూపం పొందాడు!

నుమాన్ ఆనందబాష్పాలతో, ఆ యువతికి నమస్కరించి, తనకు ఎలా కుక్క రూపం వచ్చిందీ వివరంగా తెలియజేశాడు.

ఆ యువతికి మంత్రతంత్రాలు తెలుసు. అయితే వాటిని ఆమె పదిమందికీ మేంచి చేయడానికి మాత్రమే ఉపయోగిస్తుంది. ఆమె నుమాన్ చేతికి కొంత మంత్ర జలం ఇచ్చి, ఏమి చేయాలో చెప్పి పంపింది.

నుమాన్ అప్పటికప్పుడే బయలుదేరి ఇల్లు చేరుకున్నాడు. అతణ్ణి కుక్కగా మార్చిన యువతి ఇంట్లో లేదు. ఆమె కోసం కాచుకుని కూర్చున్నాడు. కొంత సేపటికి ఆమె అక్కడికి వచ్చి నుమాన్‌ను చూసి తెల్లబోయింది. మళ్ళీ అతని మీద మంత్ర ప్రయోగం చేయడానికి నీళ్ళ కోసం అటూ ఇటూ చూడసాగింది. అంతలోపలే నుమాన్ తనతో తెచ్చిన మంత్రజలాన్ని ఆమె మీద చల్లాడు.

వెంటనే ఆ అపురూప సౌందర్యవతి ఒక గుర్రం పిల్లలా మారిపోయి, ఎటో పారిపోయింది!






సగరకుమారులు గుర్రం మాయమైన చోటికి వెళ్ళి అక్కడ తవ్వనారంభించారు. వాళ్ళు అలా పాతాళలోకం దాకా తవ్వుతూ వెళ్ళినాక, వారికి తపస్సు చేసుకుంటున్న కపిలమహాముని కనిపించాడు. ఆయన సమీపంలోనే యాగాశ్వం నిలిచి ఉన్నది.

ఆయనే గుర్రాన్ని దొంగిలించాడనుకుని సగరుడి కొడుకులు ఆయనను పట్టబోయి, ఆయన కళ్ళు తెరిచి చూసేసరికి అరవైవేలమందీ అరవైవేల బూడిద కుప్పలు అయిపోయారు.

ఈ వార్త నారదుడి ద్వారా సగరుడికి తెలిసింది. ఆయన గుర్రాన్ని ఎలాగైనా తీసుకురమ్మని అసమంజసుడి కొడుకైన అంశుమంతుణ్ణి పంపాడు.

అంశుమంతుడు పాతాళలోకం చేరి, కపిలుడున్న చోటికి వెళ్ళి, కపిలుడికి నమస్కారం చేస్తూ నిలబడ్డాడు.

కపిలుడు అతన్ని చూసి సంతోషించి, ''నాయనా, గుర్రాన్ని తీసుకుపో. వీళ్ళందరూ ఇక్కడ భస్మమైనారని మీ తాతతో చెప్పు,'' అన్నాడు.

''మహాత్మా, ఈ చనిపోయిన తండ్రులకు స్వర్గప్రాప్తి కలిగేమార్గం చెప్పండి,'' అని అంశుమంతుడు కపిలుణ్ణి వేడుకున్నాడు.

''వీళ్ళ పాపం ఇంకా కొన్ని జన్మలెత్తితేగాని తీరదు. నీకు కలగబోయే మనమడి ద్వారా వీరికి ముక్తి లభిస్తుంది,'' అని కపిలుడు అంశుమంతుడికి చెప్పాడు.

**14. గంగావతరణం**



అంశుమంతుడు యాగాశ్వాన్ని తెచ్చి సగరుడికి ఇచ్చాడు. సగరుడు అశ్వమేధ యాగం పూర్తిచేసి, అంశుమంతుడికి పట్టాభిషేకం చేశాడు.

అంశుమంతుడికి తన తండ్రుల ముక్తి గురించి విచారం పట్టుకున్నది. గరుత్మంతుడు అతనితో, "గంగను నీ తండ్రుల భస్మం పైన ప్రవహింపజేస్తే వారికి సద్గతులు కలుగుతాయి," అని చెప్పాడు.

గంగను భూమికి అవతరింపజెయ్యటానికై అంశుమంతుడు, తన కొడుకైన దిలీపుడికి పట్టం గట్టి, తాను అరణ్యాలలో తపస్సు ప్రారంభించాడు. కాని ఆ తపస్సు ఫలించకుండానే అతను చనిపోయాడు.

దిలీపుడి కొడుకు భగీరథుడు. అతను, తన తాతలకు కలిగిన దుస్థితి గురించి విని, వారిని ఎలాగైనా ఉద్ధరించాలన్న కోరిక కలిగి బ్రహ్మను ఆరాధించాడు. బ్రహ్మ ప్రత్యక్షమై, భగీరథుడు ధర్మం తప్పకుండా జీవించేటట్టు వరం ఇచ్చాడు.

తరవాత భగీరథుడు గంగను గురించి దీర్ఘకాలం తపస్సు చేశాడు. గంగాదేవి అతనికి సాక్షాత్కరించి, అతని కోరిక విని, "నేను స్వర్గం నుంచి భూమి మీదికి పడేటప్పుడు నా వేగాన్ని ఎవరు ఆపగలరు? నేను భూమిని బద్దలు చేసుకుని తిన్నగా పాతాళానికి దిగిపోతానుగదా?" అని భగీరథుణ్ణి అడిగింది.

"తల్లీ, ప్రపంచమంతా తనలో ఇముడ్చుకున్న శివుడు నిన్ను భరించగలుగుతాడు," అన్నాడు భగీరథుడు.

"నేను ఒకవేళ భూమికి వస్తే పాపులందరూ తమ పాపాలను నాలో కడుగుకుంటారు. అలా సంప్రాప్తమైన ఆ పాపాలను నేనెలా వదిలించుకోను?" అని గంగ మళ్ళీ అడిగింది.

"దేవీ, అన్ని పాపాలనూ హరించగల హరిని తమలో నిలుపుకున్న పుణ్యాత్ముల స్నానం చేత, పాపాత్ములు నీలో కలిపే పాపాలు పరిహారమవుతాయి," అన్నాడు భగీరథుడు.



"సరే, నీ కోరిక నెరవేర్చుతాను. స్వర్గం నుంచి పడేటప్పుడు నన్ను భరించేటట్టు శివుణ్ణి ఒప్పించు," అని గంగ అంతర్ధానమయింది.

భగీరథుడు శివుణ్ణి గురించి తపస్సు చేసి ఆ దేవుణ్ణి సులభంగానే ప్రత్యక్షం చేసుకుని, ఆయనకు తన కోరిక తెలిపాడు.

గంగను భరించటానికి శివుడు అంగీకరించాడు.

ఆకాశం నుంచి గంగ తిన్నగా శివుడి శిరస్సు మీద పడింది; తరవాత శివుడి జడల నుండి జారి భూమిపైన ప్రవహించనారంభించింది.

భగీరథుడు వాయువేగం గల రథం మీద దారి తీస్తూ పోతూ ఉంటే గంగ అతని వెనకగా వెళ్ళి, సగరుడి కొడుకుల భస్మరాసులపైన ప్రవహించి సముద్రం అయింది. అందుకే సముద్రానికి సాగరం అనే పేరు వచ్చింది.

స్వాయంభువు మనువు కాలంలో అరవై సంవత్సరాలపాటు వర్షాలు లేక అతి భయంకరమైన పరిస్థితి ఏర్పడింది. జనక్షయమూ, జంతుక్షయమూ విపరీతంగా కలిగి జీవితమంతా అస్తవ్యస్తమయింది. అది చూసి బ్రహ్మ, ప్రపంచమంతటినీ చక్కదిద్దగలవాణ్ణి రాజుగా చెయ్యాలని సంకల్పించాడు. ఆయనకు మనువంశంలో రిపుంజయుడనే సకలసద్గుణసంపన్నుడు కనిపించాడు. రిపుంజయుడితో బ్రహ్మ, "నాయనా, నీకు ప్రపంచాధిపత్యం ఇస్తాను. దివోదాసు అనే పేరుతో భూమిని సమర్థంగా పాలించు. వాసుకి కుమార్తె అయిన అనంగమోహిని నీకు భార్య అవుతుంది," అన్నాడు.

ఆ మాటకు రిపుంజయుడు, "తాతగారూ, ఒక్క వరం అనుగ్రహిస్తే మీరు కోరినట్టు భూభారం వహిస్తాను. ఆ వరం ఏమిటంటే, భూమి మీద కిందిలోకాల వాళ్ళుగాని, పై లోకాలవాళ్ళుగాని ఒక్కడు కూడా ఉండరాదు," అన్నాడు.

అందుకు బ్రహ్మ సమ్మతించి, ఈ సంగతి కాశీవిశ్వేశ్వరుడికి తెలిపాడు. విశ్వేశ్వరుడు సరేనన్న మీదట ఆయన రిపుంజయుడికి పట్టంకట్టి తన లోకానికి వెళ్ళిపోయాడు. తరవాత రిపుంజయుడు దివోదాసుడు అనే బిరుదుతో రాజై, ప్రపంచం మీద దేవతలు గాని, పాతాళవాసులుగాని ఉండరాదని చాటింపు వేశాడు.



ఈ చాటింపు విని భూమి మీద ఎక్కడెక్కడ ఉంటున్న దేవతలూ కాశీవిశ్వనాథుడి వద్దకు వచ్చారు. వారితో శివుడు, ''నన్ను ముందుగా అడిగే బ్రహ్మ దివోదాసుకు వరం ఇచ్చాడు. మనమంతా మందరపర్వతానికి పోదాం,'' అన్నాడు.

ప్రపంచం మీద ఎక్కడా దేవతలు లేకుండా పోయారు. దేవాలయాలలో పూజలు నిలిచిపోయాయి. దివోదాసు కాశీని రాజధానిగా చేసుకుని, ఎనిమిది వేల ఏళ్ళు ఎలాటి వంకా లేకుండా పరిపాలించాడు. దీర్ఘకాలంగా భూమినే ఆశ్రయించుకుని, అదే తమ జన్మభూమిగా ఉన్న చిల్లర దేవతలూ, దానవులూ దివోదాసు దగ్గిర కొలువు చేశారు.

భూలోకంలో తమ ఆటకట్టయినందుకు దేవతలు మహా బాధపడిపోయి, ''దివోదాసును రాజ్యభ్రష్టుణ్ణి చెయ్యటం ఎలా?'' అని తమ గురువైన బృహస్పతిని అడిగారు.

''అగ్నీ, వాయువూ, వరుణుడూ మన వాళ్ళేగద. వాళ్ళు తమ శక్తులను ఉపసంహరించారంటే భూమిలో జీవితం స్తంభించిపోతుంది. ముందు అగ్నిని సహాయనిరాకరణం చెయ్యమనండి,'' అన్నాడు బృహస్పతి.

కాశీలో ఎక్కడా నిప్పు రాజలేదు. వంటలు లేవు. దివోదాసుడికి మాత్రం ఎండ సహాయంతో భోజనం చేసి పెట్టారు. దివోదాసుడికి భోజనం అందిందిగాని ప్రజలు వచ్చి గోలపెట్టారు. సంగతి గ్రహించి దివోదాసుడు, ''ఇది దేవతల దుర్మార్గం. మీరేమీ భయపడకండి. నా తపస్సు చేత మీకు నేనే అగ్నినీ, వాయు

వునూ, వర్షాలనూ ఇస్తాను," అని ప్రజలకు చెప్పి, అంత పనీ చేశాడు.

అయితే శివుడికే కాశీవియోగం కష్ట మయింది. ఆయనకు కూడా దివోదాసు పరిపాలన అంతం చెయ్యాలనిపించింది. ఆయన అరవైనలుగురు సిద్ధయోగినులను పిలిచి, "మీరు మారువేషాలలో కాశీ నగరానికి వెళ్ళి, అక్కడి స్త్రీల పాతి వ్రత్యాన్నీ, పురుషుల ధర్మబుద్ధినీ చెడ గొట్టండి. అలా అయితేగాని దివోదాసుడు పతనం కాడు," అని హెచ్చరించాడు.

సిద్ధయోగినులు శివుడు చెప్పినట్టే చేశారు. కాని శివుడు సాధించమన్న కార్యం సాధించలేకపోయారు. అది గ్రహించి శివుడు సూర్యుడితో, "నువు కాశీకి వెళ్ళి దివోదాసు ఎలాగైనా ధర్మం తప్పేటట్టు చెయ్యి," అన్నాడు.

సూర్యుడు రకరకాల వేషాలు ధరించి కాశీలో తిరుగుతూ దివోదాసుడిలో ఏ ధర్మ లోపమైనా కనిపిస్తుందేమోనని చూశాడు. దివోదాసుడిలోనే కాదు, అతని ప్రజలలో కూడా కించిత్తయినా అధర్మం సూర్యుడికి కనిపించలేదు. పని పూర్తి కాకుండా తిరిగి పోవటం ఇష్టంలేక సూర్యుడు కాశీలోనే ఉండిపోయాడు.

తరవాత శివుడు బ్రహ్మను పిలిపించి, "దివోదాసును పతనం చెయ్యమని యోగినులను పంపాను, వారి వెనకగా సూర్యుణ్ణి పంపాను, వారందరూ కాశీలో చిక్కుకుపోయి తిరిగి రాకుండా ఉన్నారు. ఈసారి నువు వెళ్ళు," అన్నాడు.

బ్రహ్మ సరేనని వృద్ధ బ్రాహ్మణుడి వేషంలో కాశీకి వెళ్ళి, సభ తీరి ఉన్న దివోదాసును చూసి ఆశీర్వదించి, "రాజా, నువు అనుమతించినట్టయితే కాశీనగరంలో యజ్ఞాలు చేస్తాను. అయితే విశ్వేశ్వరుడు లేని కాశి చిన్నబోతున్నది. శివుణ్ణి రప్పిస్తే బాగుండును," అన్నాడు.

శివుణ్ణి పిలిపించటం గురించి దివోదాసుడు ఎటూ చెప్పలేదు. బ్రహ్మ కాశీలో పది అశ్వమేధాలు చేసి, అక్కడే ఉండి పోయాడు.






# శరీరం విలువ

ఉదయగిరి రాజు ఉదయసేనుడు గొప్ప ధర్మాత్ముడు. అతను తన రాజ్యంలో అన్ని వృత్తులవారికీ సుఖంగా జీవితం సాగేటట్టు అనేక ఏర్పాట్లు చేశాడు. అందరికీ పనులు కల్పించాడు. ఎవరు గానీ కటిక దారిద్ర్యం అనుభవించ నవసరం లేకుండా చేశాడు. రాజు ఇలా చేయటం చేత దేశంలో యాచన అన్నది చాలా భాగం తగ్గిపోయింది. ఏ పనీ చేసుకోలేని ముసలివాళ్ళూ, వికలాంగులూ బిచ్చమెత్తి కాలక్షేపం చేసుకునేవాళ్ళు.

ఆ దేశపు బిచ్చగాళ్ళలో ఒక యువకు డుండేవాడు. వాడు బుద్ధి ఎరిగినప్పటి నుంచీ బిచ్చగాడి వృత్తిలోనే బతుకుతూ వస్తున్నాడు. దేశంలో బిచ్చగాళ్ళకు ప్రోత్సాహం క్రమంగా తగ్గిపోతూ ఉన్నందు వల్ల వాడికి తన వృత్తి అంత కంతకూ కష్టతరం కాసాగింది.

చివర కొకనాడు ఉదయం మొదలు మధ్యాన్నం దాకా ఏ వీధిలోనూ వాడి కెవరూ బిచ్చం పెట్టలేదు. ఆకలి దహిం చుకుపోతూ ఆఖరికి రాజవీధిన ఒక చెట్టు కింద కూర్చుని, వాడు దారే పొయ్యే వాళ్ళందరినీ అతిదీనంగా యాచించ సాగాడు. అయినా ఎవరూ వాడి కేసి చూడ లేదు. భగవంతుణ్ణి ధ్యానిస్తేనైనా ప్రజ లకు దయ కలుగుతుందేమోనని వాడు గొంతెత్తి, "ఓ పరాత్పరా, పేదవాడి కింత ముష్టి! అపద్రక్షకా, కడుపు కాలేవాడి కొక కబళం! దయామయా, దౌర్భాగ్యుడి కింత ధర్మం!" అని కేకలు పెట్ట సాగాడు.

అప్పటికీ ఎవరూ వినిపించుకోలేదు. అరిచి, అరిచి అసలే ఆకలిగా ఉన్నవాడికి శోష కూడా రాసాగింది. వాడికి దేవుడి పైన కోపం వచ్చింది.

''ఓరి భగవంతుడా, ఎక్కడ చచ్చావురా? పుట్టించిన వాడు పెట్టించడా అంటారే, పుట్టించిన వాడివి పెట్టించవేంరా, నీ అమ్మ కడుపుకాలా!'' అంటూ వాడు నోటికి వచ్చినట్టు తిట్టసాగాడు.

ఆ సమయంలో రాజుగారు గుర్రం మీద రాజవీధి వెంట వెళుతూ బిచ్చగాడి మాటలు ఆలకించి, గుర్రాన్ని ఆపి, దిగి, వాడి వద్దకు పోయి, ''ఎవర్నిరా అలా తిట్టిపోస్తున్నావు?'' అని అడిగాడు.

''ఇంకెవర్ని? పాపాల భైరవుడు ఆ భగవంతుణ్ణే!'' అన్నాడు బిచ్చగాడు.

''భగవంతుణ్ణి పూజించాలి గాని ఎవరైనా తిడతారా? భగవంతుడు నీకేం ద్రోహం చేశాడు?'' అన్నాడు రాజు.

''ఇంకేం చెయ్యాలి? పొద్దున లేచినప్పటి నుంచీ కూడు లేదు. ఎంతసేపు ముష్టెత్తినా చిన్న కాసైనా దొరక్కపోయె!" అన్నాడు బిచ్చగాడు.

''ఒరే, నీకు డబ్బు కావాలంటే నేనిస్తాను. నేనీ దేశానికి రాజును. నీ చెయ్యి ఒకటి నాకు ఇచ్చెయ్యి. వెయ్యి రూపాయలిస్తాను. లేదా కాలొకటి ఇయ్యి. నేను రెండు వేలిస్తాను. ఇంకా నీ కళ్ళిచ్చావంటే అర్ధరాజ్యం ఇస్తాను.'' అన్నాడు రాజు.

''నీ డబ్బు నా కొద్దు. నే నేమీ ఇవ్వను,'' అన్నాడు బిచ్చగాడు.

''అంటే, నువ్వు చాలా భాగ్యవంతుడవన్నమాట! నీకు వెయ్యి రూపాయల కంటె విలువైన చెయ్యీ, రెండు వేల కన్న విలువైన కాలూ, అర్ధ రాజ్యం కన్న ఎక్కువైన కళ్ళూ ఉన్నాయన్న మాట! అవి ఇచ్చినందుకు దేవుణ్ణి పూజించక తిడతా వేమిరా, పశువా? పో, దేవుడిచ్చిన విలువైన కాళ్ళూ, చేతులూ ఉపయోగించి పొట్టపోసుకో, బిచ్చమెత్తకు!'' అని వాణ్ణి మందలించి రాజు వెళ్ళిపోయాడు.

అది మొదలు వాడు వీధుల వెంట బిచ్చ మెత్తటం మాని శరీరశ్రమ చేసి బతకటం నేర్చుకున్నాడు.





# మరుగుజ్జు మంత్రగాడు

శౌరిరాజు ఇరవైనాలుగేళ్ళ యువకుడు. అతడికి ఆస్తిపాస్తులంటూ ఏమీ లేక పోయినా, కచ్చేరీలో మంచి ఉద్యోగం వున్నది. ఒకసారి అతడు కచ్చేరీ పని మీద పొరుగు గ్రామం వెళ్ళి, చీకటిపడే వేళ ఇంటికి తిరిగి వచ్చాడు. ఆ సమయంలో వీధి అరుగు మీద కూర్చుని వున్న పనిమనిషి అతడికి, వీణావతి కొండ మీద వున్న ఆలయానికి రావలసిందిగా చెప్పిపోయినట్టు వార్త అందించింది.

వీణావతి తండ్రికి ఒక్కతే కుమార్తె. శౌరిరాజు ఇంటిపక్కనే వాళ్ళ ఇల్లు. శౌరిరాజుతో, వీణావతి వివాహానికి ఆమె తండ్రి ఏనాడో తన అంగీకారం తెలిపాడు. చెప్పవలసిన ముఖ్య విషయం ఏమైనా వుంటే, ఇంటి దగ్గిరే చెప్పవచ్చుగదా—ఆలయానికి ఎందుకు? అని ఆశ్చర్యపోతూ శౌరిరాజు బయలుదేరాడు.

అతణ్ణి అల్లంత దూరాన చూస్తూనే, వీణావతి ఒక కొండరాతి మీది నుంచి లేచి ఎదురువచ్చింది.

శౌరిరాజు చిన్నగా నవ్వుతూ, "ఏమిటంత ముఖ్య విషయం? మీ నాన్న, మన పెళ్ళి ముహూర్తం నిశ్చయించాడా?" అని అడిగాడు.

వీణావతి పొర్లివచ్చే దుఃఖాన్ని ఆపుకుంటూ, "అవును, ఎల్లుండే ముహూర్తం. అయితే, పెళ్ళికొడుకు నువ్వుమాత్రం కాదు!" అన్నది.

శౌరిరాజు నిర్ఘాంతపోయి, "అసలేం జరిగింది?" అని అడిగాడు.

వీణావతి జరిగినదంతా అతడికి చెప్పింది: నిన్న అనుకోకుండా ఆమె తండ్రి చిన్ననాటి స్నేహితుడొకాయన వాళ్ల ఇంటికి వచ్చాడు. ఆయన సముద్ర వ్యాపారంలో లక్షలు గడించాడట.

మాచిరాజు కామేశ్వరరావు



వెంటవచ్చిన ఆయన కొడుక్కు వీణావతి నచ్చింది. దగ్గిర్లో మంచి ముహూర్తం వున్నది గనక, అతడితో వీణావతి వివాహం జరిపిస్తానని తండ్రి తన స్నేహితుడికి మాట యిచ్చాడు.

వాళ్ళు వెళ్ళిన తరవాత ఆమె అభ్యంతరం చెబితే తండ్రి కోపగించుకుని, ''నువ్వు నోరుమూసుకో. శౌరికి సొంత ఆస్తంటూ చిల్లిగవ్వలేదు. శాశ్వతం అనుకున్న కచ్చేరీ ఉద్యోగాలు, హఠాత్తుగా పోగొట్టుకున్నవాళ్ళను, నేనెరుగుదును. ఈనా స్నేహితుడికి లక్షల ఆస్తి వున్నది. ఈ పెళ్ళికి నువ్వు కాదంటే, నేను దేశాలు పట్టిపోతాను,'' అన్నాడు.

అంతా విన్న శౌరిరాజు ఆవేశం తెచ్చుకుని, ''అలాగా! నేను వచ్చి, మీ నాన్నతో మాట్లాడతాను,'' అన్నాడు.

వీణావతి అయిష్టంగా తలాడిస్తూ, ''ఆ పని మాత్రం చేయకు. మా నాన్నది వెర్రికోపం. గొడవ జరిగితే, నిజంగానే దేశాలు పట్టిపోగలడు,'' అని ఇంటికేసి బయలుదేరింది.

ఈ జరిగినదానికి శౌరిరాజు చాలా కలవరపడిపోయాడు. ఇక ఆ రాత్రికి ఇంటికి వెళ్ళకూడదనుకున్నాడు. కొంతసేపు ఒక రాతి మీద కూర్చుని, ఏదో నిశ్చయానికి వచ్చినవాడిలా లేచి, కొండ అవతలివైపుకు బయలుదేరాడు.

కొండ అవతల నాలుగైదామడల దూరంవరకూ, ఒక పెద్ద అరణ్యం వున్నది. అందులో ఆటవికులు తిరుగుతుంటారనీ, వాళ్ళు చాలా క్రూరులనీ చాలామంది నమ్మకం. శౌరిరాజు కొండదిగి అరణ్యంలో కొంతదూరం నడిచాక, ''ఎవడు వాడు?'' అన్న కేక విని ఆగిపోయాడు.

ఇద్దరు ఆటవికులు ఈటెలు ఝుళిపిస్తూ, అతడి ముందుకు వచ్చి, ''నువ్వెక్కడికి పోతున్నావు? ఇంత రాత్రివేళ అరణ్యంలో, నీకేం పని?'' అని అడిగారు.

శౌరిరాజు ఒక్కక్షణం భయపడి, అంతలోనే ధైర్యం తెచ్చుకుని, ''ఈ మహా

రణ్యంలో ఏ పులివాతో పడదామని వచ్చాను. నేను తీరని కష్టాల్లో వున్న వాడిని,'' అన్నాడు.

ఆ జవాబు విని ఆటవికు లిద్దరూ కొంచెం ఎడంగాపోయి కూడబలుక్కుని, తిరిగి శౌరిరాజు దగ్గిరకు వచ్చి, ''కష్టాల్లో వున్న మనుషులంటే, మాకు జాలి. ఇక్కడ పిశాచాలదిబ్బ మీద వుండే పిశాచాలవల్ల, ఆటవికులం, నానా కష్టాలూ పడుతూండగా, ఒక మరుగుజ్జు మంత్రగాడు వచ్చి, మమ్మల్నిరక్షించాడు. ఇప్పుడాయన నివాసం పిశాచాలదిబ్బ మీదే. నిన్ను పట్టి పీడుస్తున్న కష్టాలేమిటో ఆయనకు చెప్పుకో,'' అని, అతణ్ణి మరుగుజ్జు మంత్రగాడి దగ్గిరకు తీసుకుపోయారు.

మంత్రగాడు ఒక చిన్న పాకవెలపల నెగడువేసుకుని, దానిముందు కూర్చుని వున్నాడు. వాడు, శౌరిరాజును చూస్తూనే, ''పన్నెండేళ్ళ తరవాత, నన్ను వెతుక్కుంటూ వచ్చిన మనిషివి! ఎవడివిరా నువ్వు?'' అన్నాడు కీచుగొంతుతో.

''మామా, పెద్ద కష్టం వచ్చి, ఇంత రాత్రివేళ నిన్ను వెతుక్కుంటూ వచ్చాను,'' అన్నాడు శౌరిరాజు, మరుగుజ్జు ముందు కూర్చుంటూ.

మంత్రగాడు నెగడులోంచి భగభగమండుతున్న ఒక కట్టె తీసి, దాని వెలుగులో శౌరిరాజు ముఖాన్ని పరీక్షగా చూసి, ''ఇంతకూ, నీకొచ్చిన కష్టం ఏమిటి?'' అని అడిగాడు.





శౌరిరాజు తన కష్టం గురించి చెప్పుకుని, "వీణావతితో, నా పెళ్ళి జరక్కపోతే, ఇక యీ పిశాచాలదిబ్బేగతి! ఎల్లుండి మరొకడితో జరగబోయే వీణ పెళ్ళి ఆగిపోవాలి. ఆవిడతండ్రి, నాతో తన కూతురు పెళ్ళి జరిపించాలి. ఇందుకేదైనా మంత్రమో, తంత్రమో ఉపయోగించి, నువ్వు నాకు సాయపడాలి," అన్నాడు.

ఆ మరుక్షణం మరుగుజ్జు మంత్రగాడు కణకణలాడుతున్న నెగటినిప్పుల్లో చేయి పెట్టాడు. వెంటనే నీళ్ళు పోసినట్టుగా నెగడు ఆరిపోయి, అందులో నల్లటి బొగ్గులు బయటపడినై.

మంత్రగాడు ఒక బొగ్గు తీసి, నుదుటికి అనించుకుని ఏదో మంత్రం చదివి, దాన్ని శౌరిరాజుకు యిస్తూ, "నువ్వు చేసుకోవాలనుకుంటున్న అమ్మాయిని, యీ బొగ్గును బెల్లం నమిలినట్టు నమిలి మింగమను," అన్నాడు.

శౌరిరాజు వాడిని ఏదో అడగబోయాడు. కాని, మంత్రగాడు లేచి తన పాకకేసి పోతూ, "అనవసర ప్రశ్నలు వేసి నన్ను విసిగించకు. ఇక వెళ్ళరా, అల్లుడూ," అన్నాడు.

శౌరిరాజు ఆ బొగ్గు తీసుకుని ఇంటికి తిరిగి వచ్చాడు. తరవాత కొంతసేపటికి వీణావతి పడుకునే గది కిటికీ దగ్గిరకు పోయి, దాని రెక్క మీద చిన్నగా తట్టాడు. వీణావతి వెంటనే వచ్చి కిటికీ రెక్కలు తెరిచింది.

అతడు చిన్న గొంతుతో, "నన్నేమీ ప్రశ్నించక, యీ బొగ్గు నమిలిమింగు!" అని బొగ్గును ఆమెకిచ్చాడు.

వీణావతి సరే అన్నట్టు తల ఊపగానే, శౌరిరాజు తృప్తిగా తన ఇంటికి వెళ్ళిపోయాడు. తెల్లవారాక వీణావతిని నిద్ర లేపవచ్చిన అమ్మలక్కలు, ఆమెను చూస్తూనే కెవ్వుమన్నారు. ఆమె పచ్చని పసిమిరంగు శరీరచ్ఛాయ, నల్లని బొగ్గు రంగులోకి మారివున్నది.

ఈ జరిగిన వింత క్షణాల మీద ఊరంతా తెలిసిపోయింది. మగపెళ్ళివారు యీ వార్త విని వీణను చూడవచ్చి, ''ఇదేం చిత్రం! ఈ పిల్ల మాకొద్దు. ఇదేదో రంగులు మార్చే భూతం లక్షణం,'' అని వెళ్ళిపోయారు.

వీణావతి తండ్రి నిరాశతో తల పట్టుకుని కూర్చున్నాడు. ఇలా ఎందుకు జరిగిందో ఎంత ఆలోచించినా, అతడికి అర్థం కాలేదు. ఎంత కట్నం డబ్బు వెదజల్లినా, ఈ రూపుతో వున్న కూతురు పెళ్ళి, తను జన్మలో చేయలేడు!



ఆయన కచ్చేరీకి పోతున్న శౌరిరాజును ఆపి, ''బాబూ, నీకు వీణ అంటే ప్రాణంతో సమానమని, నాకు తెలుసు. గిట్టనివాళ్ళెవరో దానికి చేతబడి చేశారు. రేపు ముహూర్తానికి అమ్మాయిని పెళ్ళాడి, నా పరువు నిలుపు.'' అంటూ చేతులు పట్టుకున్నాడు.

శౌరిరాజు వెంటనే, ''మీ యిష్టం. నాకెలాంటి అభ్యంతరంలేదు,'' అన్నాడు.

ఆ మాటలు విన్న వీణావతి కళ్ళనీళ్ళు పెట్టుకుని, ''శౌరీ, నాలాంటి కురూపి, నీకు తగదు,'' అన్నది.

శౌరిరాజు చిరునవ్వు నవ్వుతూ ఊరుకుని, ఆ రాత్రి తిరిగి మరుగుజ్జు మంత్రగాడి దగ్గిరకు వెళ్ళాడు.

వాడు శౌరిరాజును చూస్తూనే, ''ఏరా, అల్లుడూ! మన పథకం పారిందికదా?'' అన్నాడు ఉత్సాహంగా.

''పారకేం—ఆ పెళ్ళికొడుకు తరఫు వాళ్ళు ఠారుకుని పారిపోయారు. రేపే వీణతో నా పెళ్ళి. నిన్నటి మంత్రపు బొగ్గుకు విరుగుడు యిస్తే, నీ ఆశీర్వాదం కూడా తీసుకుని వెళ్ళిపోతాను,'' అన్నాడు శౌరిరాజు.

''విరుగుడేమిటి? అలాంటిదేమీ, నా దగ్గిర లేదే!'' అన్నాడు మంత్రగాడు.

శౌరిరాజు నిర్ఘాంతపడి, ''అయితే, వీణ ఎప్పటికీ అలా కారునలుపు రంగుతో వుండిపోవలసిందేనా?'' అని అడిగాడు.

''ఆహాఁ, అంతేమరి! అయినా, ఆ పిల్ల అంటే నీకు చాలా ప్రేమగదా. పిల్ల మారలేదు; రంగు మారింది, అంతే. ఇప్పుడు నువ్వా కురూపిని చేసుకునేందుకు సంశయిస్తున్నావన్నమాట! సరే, మరెక్కడైనా అందంగా వున్న అమ్మాయిని చూసి పెళ్ళాడు,'' అన్నాడు మంత్రగాడు.

శౌరిరాజు వాడి మాటలకు నొచ్చుకుని, ''వీణ కురూపి అయిందని, నేను పెళ్ళాడడానికి యిష్టపడడం లేదని అనుకోకు, ఆమే తాను నాకు తగనంటూ దుఃఖిస్తున్నది. ఆ మంత్రించిన బొగ్గు నాకూ యివ్వు. అప్పుడు యిద్దరం ఒకలాగే వుంటాం. ఆవిడకే బాధా వుండదు,'' అన్నాడు.

''ఒరే, అల్లుడూ! నిజంగా నీ ప్రేమ గొప్పది. ఆ సంగతి తెలుసుకునేందుకే, అలా అన్నాను,'' అని మంత్రగాడు పక్కన వున్న బుట్టలోంచి ఒక జామపండు తీసి దాన్ని మంత్రించి, శౌరి రాజుకు యిచ్చి, ''దీన్ని నీకాబోయే భార్య తింటే, ఎప్పటి రంగు వచ్చేస్తుంది,'' అన్నాడు.

శౌరిరాజు పండు తీసుకుని, ''పెళ్ళయాక ఏదో ఒక రోజున మేం యిద్దరం యిక్కడికి వస్తాం. నీ మేలు మరిచిపోలేం, మామా!'' అన్నాడు.

అందుకు మరుగుజ్జు మంత్రగాడు కటువుగా, ''మరిచిపో! నన్నూ, నేను చేసిన మేలునూ కూడా మరిచిపో. నన్ను గురించి ఎవరికీ చెప్పకు. ఏనాడూ నా దగ్గిరకు రాకు. ఈ అరణ్యంలో, కల్లాకపటం ఎరగని ఆటవికుల మధ్య నన్ను ప్రశాంతంగా బతకనీ. ఇక వెళ్ళు!'' అన్నాడు ఆజ్ఞాపిస్తున్నట్టు.

శౌరిరాజు ఇంటికి తిరిగి వచ్చి, మంత్రగాడిచ్చిన జామపండును వీణావతికి యిచ్చాడు. ఆ పండు తిన్న ఆమె, మునుపటిలా పచ్చని పసిమిరంగుతో కళకళలాడిపోయింది.

మర్నాడు, ఎప్పటి అందంతో పెళ్ళిపీటల మీద శౌరిరాజు పక్కన కూర్చున్న వీణావతిని చూసి, ఆమె తండ్రితోపాటు అందరూ ఎక్కడలేని ఆశ్చర్యం పొందారు.



# తొందరపాటు

సురేంద్రుడనే రాజు, తన కుమారుణ్ణి విద్యాభ్యాసం కోసం, శ్రీకర్ణుడనే గురువు నడుపుతున్న గురుకులానికి పంపాడు. ఒక సంవత్సరం తరవాత అయన గురుకులాన్ని చూడబోయి, తన కుమారుడి విద్యాభ్యాసం సంతృప్తికరంగా లేదని భావించాడు.

ఈ విషయం శ్రీకర్ణుడితో ప్రస్తావిస్తూ, "గురువర్యా, రాకుమారుడి విద్యాభ్యాసం శీఘ్రంగా ముగిసే ఏర్పాటు చేయలేరా? అతడి విద్యాభ్యాసం రెండు, మూడు సంవత్సరాల్లో ముగిసిపోతే బావుంటుంది," అన్నాడు.

దానికి శ్రీకర్ణుడు, ఆ పక్కనే ఒక విద్యాభవనం నిర్మించేందుకు తెప్పించి కుప్పలుగా పోసివున్న రాళ్ళూ, కలపాలాంటి వాటిని రాజుకు చూపిస్తూ, "మహారాజా, ఈ ముడిసరుకును ఉపయోగించి, అన్ని హంగులూ వున్న భవనం నిర్మించడానికి కనీసం సంవత్సరకాలం పట్ట వచ్చు. అదే ఒక పూరిగుడిసె కట్టడానికి నాలుగైదు రోజులు చాలు. అయితే, మన హంగుకూ, హోదాకూ సరిపడేది పూరిగుడిశా? లేక భవనమా? అన్నది మనం ముందు తెల్చుకోవాలి," అన్నాడు.

ఈ జవాబు విన్న తరవాత రాజుకు తన తొందరపాటు తెలిసివచ్చింది. అయన రాకుమారుడి విద్యాభ్యాసం, తతిమ్మా అందరు విద్యార్థులతోపాటు జరపవలసిందిగా శ్రీకర్ణుణ్ణి కోరి, సెలవు తీసుకున్నాడు.

—సి. ఎస్. ఎ. షరీఫ్





# చాణక్యుడి కథ

(గత సంచిక తరువాయి)

చాణక్య చంద్రగుప్తులు నందుడి రాజభవనం వశపరచుకుని అందులోని సొత్తంతా సమంగా పంచుకున్నారు. ఆ భవనంలో ఒక దాసీ ఉన్నది. ఈమెకు విషం అలవాటయింది. ఆ దాసీని తన కిమ్మని పర్వతకుడు అడిగాడు. చాణక్యుడు సమ్మతించాడు. అగ్నిసాక్షిగా పర్వతకుడామెను పెళ్ళాడుతూ ఆమె చెయ్యి పట్టుకునేసరికి, ఆమె చేతి చెమట ద్వారా విషం పర్వతకుడి శరీరంలో ప్రవేశించింది. అతను విరుచుకుపడిపోతూ వైద్యులను పిలవమన్నాడు. చంద్రగుప్తుడు వైద్యుల కోసం కబురు చెయ్యబోతూ వుంటే, చాణక్యు డతన్ని వారించాడు.

అర్ధరాజ్యం పొందవలసిన పర్వతకుడు కనీసం వైద్యసహాయం కూడా లేకుండా, ప్రాణాలు వదిలాడు. పైపెచ్చు పర్వతకుడి రాజ్యం కూడా చంద్రగుప్తుడిదే అయింది.

నందుడి పరిపాలన అయితే అంతమయిందిగాని, నందుడి అనుచరులు రకరకాల అరాచక చర్యలు చేస్తూ, పరిపాలనలో శాంతి లేకుండా చేశారు. వీరిని అదుపులో పెట్టగల మనస్తత్వం గల ఒక సాలెవాడు చాణక్యుడి కళ్ళపడ్డాడు. ఈ సాలెవాడు తన ఇంట చెదలపుట్ట కనిపించిన చోటనల్లా నిప్పు పెట్టటం ఆయన గమనించాడు. అరాచక చర్యలను చేసే వారందరినీ ఈ సాలెవాడు త్వరలోనే నిగ్రహించగలిగాడు. చాణక్యుడికి వాడి యందు ఏర్పడిన విశ్వాసం రుజువయింది.

చంద్రగుప్తుడికి రాజ్యం వచ్చింది గాని కోశంలో డబ్బు లేదు. ఈ లోటు భర్తీ చెయ్యటానికి చాణక్యుడు దొంగ పాచికలతో బంగారం పణంపెట్టి జూదం ఆడి,

కొంత బంగారం గడించాడు. కాని ఇలా కోశాన్ని నించటం దాదాపు అసాధ్యంగా కనిపించింది. అప్పుడు చాణక్యు డొక యుక్తి చేశాడు. ఆయన నగరంలోని ధనికులందరినీ విందుకు పిలిచి భోజనం పెట్టి పుష్కలంగా తాగించాడు. అందరూ కైపు మీద ఉండగా చాణక్యుడు లేచి నిలబడి, తన అదృష్టం ఎలాంటిదో, రాజు ఎలా తన చెప్పుచేతలలో ఉంటాడో తెలియ జేసే శ్లోకం ఒకటి చదివాడు. వెంటనే మిగిలిన వాళ్ళు కూడా తమ గొప్పలు చెప్పుకుని, ఎవరి దగ్గిర ఎంతెంత ధనం ఉన్నదీ బయట పెట్టుకున్నారు. చాణక్యుడు వారి బొక్కసాలు కొల్లగొట్టి రాజుగారి బొక్కసం నించాడు.



చంద్రగుప్తుడి రాజ్యంలో ఒకసారి పెద్ద కరువు వచ్చింది. రాజధానిలో ఉండే జైనసన్యాసులకు భిక్ష కరువైపోయింది. వారి ఆచార్యుడైన సుస్థితుడు తన శిష్యు లను నగరం విడిచిపోయి, మరెక్కడ నైనా భిక్ష చేసుకు బతకమని సలహా యిచ్చాడు. అందరూ వెళ్ళిపోయారు గాని ఇద్దరు శిష్యులు గురువును వదిలిపోవ టానికి మనస్కరించక తిండి కోసం ఒక ఎత్తు వేశారు. వారికొక అంజనం తెలుసు. అది కళ్లకు పూసుకున్నవాళ్ళు అదృశ్యు లవుతారు. ఆ శిష్యులిద్దరూ ఆ అంజనం పూసుకుని, అదృశ్యులై రాజగృహం ప్రవే శించి, చంద్రగుప్తుడి పళ్ళెం వద్దనే కూచుని, అతనితోబాటు భోజనం చేసి వెళ్ళిపోతూ వచ్చారు.

ఇలా కొంతకాలం జరిగినాక, చాణక్యుడు చంద్రగుప్తుడు చిక్కిపోతున్న లక్షణాలు గమనించి కారణమడిగాడు.

"నాకు కూడా కారణం తెలియలేదు. రోజూ నాకు మామూలు ప్రకారమే భోజనం వడ్డిస్తున్నారు. కాని అదంతా నా కడుపులోకి పోవటం లేదని చెప్పగలను," అన్నాడు చంద్రగుప్తుడు.

ఎవరైనా అదృశ్యంగా వచ్చి చంద్ర గుప్తుడి ఆహారం తస్కరించుతూ ఉండ



వచ్చునని చాణక్యుడికి తోచింది. ఇది నిజమో కాదో తేల్చుకోవటానికి ఆయన చంద్రగుప్తుడి భోజనశాల అంతటా మెత్తని పొడి చల్లించాడు. చంద్రగుప్తుడి భోజనం పూర్తి అయాక ఆ పొడిలో ఎవరివో కాళ్ళ గుర్తులు కనిపించాయి.

మర్నాడు చంద్రగుప్తుడు భోజనం చేసే సమయంలో చాణక్యుడు భోజనశాలలో ఘాటైన పొగ పెట్టించాడు. ఆ పొగకు అందరి కళ్ళూ చిరచిరలాడి ఆగకుండా కళ్ళనీరు కారింది. ఆ నీటి వెంట జైన యువకులు పెట్టుకున్న అంజనం కాస్తా కరిగిపోయి, వారు అందరికీ కనిపించారు. అందరూ నిర్ఘాంతపోయారు. వారికి కోపం కూడా వచ్చింది. అయితే చాణక్యుడు మాత్రం జైన సన్యాసులకు ఒక నమస్కారం పెట్టి, మర్యాదగా సాగనంపాడు. ఇతరుల ఎంగిలి తిన్నందుకు చంద్రగుప్తుడు బాధపడుతూంటే, వారికి భిక్ష పెట్టినందుకు పుణ్యం లభించిందని నచ్చచెప్పాడు. అయినప్పటికీ చాణక్యుడు ఆచార్యుడికి కబురు చేసి, ఆయన శిష్యులు చేసిన పనికి ఆక్షేపణ తెలియ జేశాడు.

"తప్పు మీ పౌరులదే. మా సన్యాసులకు వారు భిక్ష పెట్టినట్టయితే ఇలాటి పరిస్థితి ఏర్పడి ఉండదు." అని ఆచార్యుడు జవాబు పంపాడు. అది మొదలు పాటలీపుత్రంలో జైన సన్యాసులకు విడవకుండా భిక్ష లభించే ఏర్పాట్లు జరిగాయి.

చంద్రగుప్తుడి పైన ఎవరైనా విషప్రయోగం చేస్తారేమోనని చాణక్యుడు అతని ఆహారంలో విషం చేర్చమని ఆజ్ఞాపించాడు. ఈ విషం మోతాదు క్రమంగా వృద్ధి అయి చంద్రగుప్తుణ్ణి ఏ విషమూ ఏమీ చెయ్యలేని స్థితి ఏర్పడింది. ఈ సంగతి చంద్రగుప్తుడికి తెలియదు.

దుర్ధర నిండు చూలాలుగా ఉండి ఒకనాడు చంద్రగుప్తుడి భోజనపు పళ్ళెం వద్ద కూచుని అతని ఆహారం కొంచెం తీసుకు తిన్నది. అది బాగా విషపూరితం



కావటంచేత వెంటనే ఆమె ప్రాణాలు వదిలింది. ఆ క్షణంలోనే అక్కడికి వచ్చిన చాణక్యుడు జరిగిన ప్రమాదం గుర్తించి, అప్పుడే ప్రాణాలు వదిలిన దుర్ధర గర్భాన్ని చీల్చి అందులో నుంచి శిశువును లాగాడు. అప్పటికే ఒక్క బిందువు విషం శిశువులోకి ప్రవేశించింది. ఈ కారణంచేతనే ఆ శిశువుకు బిందుసారుడని పేరు పెట్టారు.

చంద్రగుప్తుడు చనిపోయినాక చాణక్యుడు బిందుసారుడికి తానే స్వయంగా పట్టాభిషేకం చేశాడు. అయితే బిందుసారుడి కింద ఎంతోకాలం మంత్రిగా ఉండలేదు. చాణక్యుడు సుబంధు డనేవాణ్ణి చేరదీసి రాజకీయ తంత్రం నేర్పి తన అనుచరుడుగా ఉంచుకున్నాడు. ఈ సుబంధుడికి మంత్రిత్వ కాంక్ష పట్టుకున్నది. అతను బిందుసారుడితో చాణక్యుణ్ణి ఎంత మాత్రమూ నమ్మవద్దనీ, ఆయన బిందుసారుడి తల్లి గర్భాన్ని చీల్చినవాడనీ చెప్పాడు. బిందుసారుడు విచారించగా ఈ సంఘటన జరిగిన మాట నిజమేనని తెలిసింది. దానితో అతనికి చాణక్యుడి పైన ఎక్కడ లేని ద్వేషమూ పుట్టుకొచ్చింది.

తన ప్రత్యర్థి జయించాడని తెలియగానే చాణక్యుడు తన భవిష్యత్తును గురించి వైరాగ్యం అవలంబించాడు— కాని ఆ ప్రత్యర్థిని మాత్రం క్షమించలేదు. సుబంధుడి పతనం కోసం ఆయన ఒక ప్రయోగం చేశాడు. ఆయన భూర్జ పత్రాల పైన ఏదో రాసి, ఆ పత్రాలనూ కొన్ని సుగంధ ద్రవ్యాలనూ ఒక అందమైన పేటికలో ఉంచి, ఆ పేటికను తన పెట్టెలో పెట్టి భద్రంగా తాళం వేశాడు. అనంతరం ఆయన తన యావదాస్తినీ పేదసాదలకు దానంచేసి, ఊరి బయట ఉండే చెత్తకుప్ప మీదికి వెళ్ళి ప్రాయోపవేశం చేశాడు.

ఈ స్థితిలో బిందుసారుడికి చాణక్యుణ్ణి గురించి వాస్తవం తెలియ

వచ్చింది. అతను ఎంతో పశ్చాత్తాపపడి, చాణక్యుడి వద్దకు వెళ్ళి, వచ్చి మంత్రి పదవి నిర్వర్తించమని ప్రాధేయపడ్డాడు. కాని చాణక్యుడు తన దీక్ష మానలేదు. బిందుసారుడు తిరిగివచ్చి తన ఆగ్రహమంతా సుబంధుడి పైన వెళ్ళబోసుకున్నాడు. సుబంధుడు తాను నిర్దోషిననీ, చాణక్యుడి మనసు మారుస్తాననీ రాజుతో అన్నాడు. ఆ ప్రకారమే అతను చాణక్యుడి వద్దకు వెళ్ళి, ఏదో అనునయ వాక్యాలు మాట్లాడుతున్నట్టే మాట్లాడుతూ, నివురు గప్పిన నిప్పు కణిక ఒకటి చెత్తకుప్పలో జారవిడిచాడు. దానితో చెత్తకుప్ప అంటుకుని మండింది. చాణక్యు డా మంటలోనే బూడిద అయాడు.

బిందుసారుడి అనుమతితో సుబంధుడు చాణక్యుడి ఇల్లు ప్రవేశించి, ధనం కోసం ఇల్లంతా గాలించగా, చాణక్యుడి పెట్టెలో ఉన్న పేటిక బయట పడింది. దాన్ని తెరవగానే గుప్పున సువాసన పైకి చిమ్మింది. తరవాత అతనికి భూర్జ పత్రాలు కనిపించాయి. చాణక్యుడి ధనం గురించిన రహస్యాలు అందులో ఉంటా యనుకుని సుబంధుడు చదివి చూసి తెల్లబోయాడు. సన్యాసి జీవితం గడపని వారు ఈ సుగంధం వాసన చూస్తే చచ్చిపోతారని భూర్జపత్రాలపై రాసి ఉన్నది. అది నిజమో కాదో తెలుసుకోవటానికి ఆ సుగంధాన్ని ఒక మనిషికి గట్టిగా వాసన చూపించాడు, సుబంధుడు. వాడు విరుచుకు పడిపోయి చచ్చాడు. ఎన్ని విరుగుళ్ళు ప్రయోగించినా ఫలితం లేకపోయింది. తనకూ అదే గతి పడుతుం దనుకుని సుబంధుడు తన మంత్రిత్వానికి నీళ్ళు వదిలి జైనగురువు వద్ద సన్యాసం పుచ్చుకున్నాడు. అది చిత్తశుద్ధితో పుచ్చుకున్న సన్యాసం కాదని బాగా ఎరిగి వున్న తోటి సన్యాసులందరూ అతణ్ణి చాలా హీనంగా చూశారు.

చాణక్యుడిపై కుట్ర చేసిన ఫలితం సుబంధుడికి దక్కలేదు. చాణక్యుడు చచ్చి కూడా తన ప్రత్యర్థిని సాధించాడు.



# టాస్మానియా క్రూరజంతువులు

ఆస్ట్రేలియాకు ఆగ్నేయదిశలో ఉన్న టాస్మానియా ద్వీపం ప్రశాంత వాతావరణంతో వెలుగొందుతున్నది. ఈ ప్రశాంత వాతావరణంలోనే విచిత్రమైన క్రూరజంతువులు—టాస్మానియా తోడేలు, టాస్మానియా డెవిల్, టైగర్ క్యాట్ నివసిస్తున్నాయి.

ఈ జంతువులలో టాస్మానియా తోడేలు ఆకారంలో పెద్దది. ఇది చాలా అరుదుగా కనిపిస్తుంది. చూడడానికి మామూలు తోడేలులా ఉన్నా దానికన్నా ఆకారంలో చిన్నది. శరీరం మీద చారలు ఉంటాయి. ఆడతోడేళ్ళు పొదుగుచుట్టూ తిత్తిలా ఉన్న చర్మం లోపల పిల్లలను మోసుకుపోతాయి. పిల్ల పుట్టగానే ఆ సంచీలోకి చేరి, పెద్దదయ్యేవరకు అక్కడే వుంటుంది. పిల్ల మరీ పసికందుగా ఉన్నప్పుడు దాని నోట్లో ఎప్పుడూ తల్లి స్తనాగ్రం ఉంటుంది. పిల్లకు పాలు ఎప్పుడు కావాలో గ్రహించి, తల్లి దానికి అప్పుడప్పుడూ పాలు పడుతుంది. కొండ గుహలలో ఉంటూ రాత్రి సంచారం జరిపే ఈ తోడేళ్ళు ఒకప్పుడు ఆస్ట్రేలియా ఖండం అంతటా వ్యాపించి ఉండేవి. ప్రస్తుతం టాస్మానియా ద్వీపానికే పరిమితమైపోయాయి.

పొదుగుచుట్టూ సంచీ ఉన్న జాతి సంతతికి చెందిన మరొక ముఖ్యమైన జంతువు టాస్మానియన్ డెవిల్. ఇది చూడడానికి పీటికుక్క లాగా ఉంటుంది. పెద్ద తల, వెడల్పయిన మోరతో చాలా బలంగా ఉంటుందీ జంతువు. పెద్దదైన గుండ్రటి చెవులతో, శరీరం నిండా రోమాలతో, నలుపు, ఊదా రంగుతో, మెడ మీద, పిరుదుల మీదా తెల్లటి మచ్చలతో ఉండే ఈ జంతువు రాత్రులలోనే ఆహార అన్వేషణ సాగిస్తుంది. సూర్యుడి వెలుతురులో వీటికి కళ్ళు కనిపించవు. అందువల్ల పగలల్లా చీకటి గుహలలో, బొరియలలో చుట్టుకుని పడుకుంటాయి.

ఇవి ఎంతటి క్రూరజంతువులయినప్పటికీ, ఎప్పుడూ ఆడుకుంటూ ఉల్లాసంగా గంతులు వేస్తూ ఉండడం వల్ల వీటి పిల్లలను కొందరు పెంచుకుంటారు.

టాస్మానియాలోనూ, ఆస్ట్రేలియాలోనూ కనిపించే మరొక క్రూరమృగం-టైగర్ క్యాట్. ఇవి మామూలు పిల్లులంతే ఉంటాయి. వీటి పళ్ళు కూడా పిల్లులకులాగే ఉంటాయిగాని, దంతాలు మాత్రం అంత బలమైనవి కావు. ఊదా రంగు శరీరం నిండా తెల్లటి మచ్చలుంటాయి. చిన్న చెవులు, పొడవైన తోక, శరీరమంతా రోమాలు కలిగి ఉంటాయి.



## ఫోటో వ్యాఖ్యల పోటీ : : బహుమానం రు. 50 లు

ఈ ఫోటోల వ్యాఖ్యలు 1986 ఏప్రిల్ నెల సంచికలో ప్రకటింపబడును.



A. V Rangaiah



M. C. Morabad

★ పై ఫోటోలకు సరియైన వ్యాఖ్యలు ఒక్కమాటలో గానీ, చిన్న వాక్యంలోగానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం ఉండాలి.) ★ ఫిబ్రవరి నెల 15వ తేదీలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. ★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా ఉన్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 50/–లు బహుమానం. ★ వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డుపైన రాసి, ఈ అడ్రసుకు పంపాలి: – చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు-26

---

### డిసెంబర్ నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో: ఇంటికి జ్యోతి

రెండవ ఫోటో: దేశానికే ఖ్యాతి

పంపినవారు: జి. రత్నకుమార్, చిట్టినగర్, విజయవాడ-520 009.

బహుమతి మొత్తం రు. 50/–నెలాఖరులోగా పంపబడుతుంది.

### మీకు తెలుసా? సమాధానాలు

1. కమాండర్ పీరి 2. అముండ్సెన్ 3. ఎబెల్ టాస్మన్ 4. సర్ ఫ్రాన్సిస్ డ్రేక్ 5. విక్టోరియా జలపాతం.

Printed by B.V. REDDI at Prasad Process Private Ltd., 188 N.S.K. Salai, Madras 600 026 (India) and Published by B. VISWANATHA REDDI on behalf of CHANDAMAMA PUBLICATIONS, Chandamama Buildings, Vadapalani, Madras 600 026 (India). Controlling Editor: NAGI REDDI.



రారెవ్వరూ నాకు జ్వరమని
వేరెవ్వరు నాకింక తోడని
ఆలోచించా నేనేదో చెయ్యాలని
ఇంట్లో అందరి సరదాతీర్చాలని
ఇవిగో పెన్నులు, అదిగో కాగితం
ఎకో రంగులతోనే నాకింక స్నేహం.
గీసేస్తా గీతలతోనే ఓ బొమ్మ
మురిసిపోయి ముద్దివ్వాలి మా అమ్మ
ఎకో పచ్చ, ఎకో నీలం
ఎరుపు పసుపు నారింజ రంగులమయం
ఊదా, నలుపు, వైలెట్
గులాబీ, గోధుమలతో అయ్యేనది ఓసెట్




# ఎకో
స్కెచ్ పెన్ రంగులే ఇక రంగులు- సరదాతీర్చే హంగులు!